## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions |
Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!



ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్

నమో బ్రహ్మణే

# ఉపనిషత్సుధ

రెండవ భాగము

(ముండ మాండూక్య తైత్తిరీయైతరేయోపనిషత్తులు)



చర్ల గణపతిశాస్త్రి

ఉపనిషద్భా
ముండకోపనిషత్
(అథర్వ వేదాంతర్గతా)
ప్రథమ ముండకే
ప్రథమః ఖండః
శాంతిమంత్రః
ఓమ్

భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః భద్రం పశ్యే మాక్షభి ర్యజత్రాః
స్థిరైరంగై స్తుష్టువాంస స్తనూభిః వ్యశేమ దేవహితం యదాయుః.

దేవతలమగుచు చెవులచే శుభము విందుముగాక. యజ్ఞశీలురమైన మేము కన్నులచే శుభమును జూచెదముగాక. స్థిరములైన యంగములతో మిమ్ము శరీరము లను మంత్రములతో స్తుతించుచు దేవులు ప్రసాదించిన దీర్ఘాయువును బొందుదుముగాక.

స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తి నః పూషా విశ్వవేదాః
స్వస్తి నస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తి నో బృహస్పతి ర్దధాతు.

బృహస్పతి మొదలగు పెద్దలయొద్ద వినెడి యింద్రుఁడు మాకు శుభము గలుగఁ జేయుఁగాక, సర్వమును దెలిసిన సూర్యుఁడు మాకు శుభమిచ్చుఁగాక. అహింసా పాలకుఁడైన గరుత్మంతుఁడు మాకు శుభమిచ్చుఁగాక. బృహస్పతి మాకు శుభమిచ్చుగాక.

ఓం

శాంతి శ్శాంతి శ్శాంతిః

ఉపనిషత్సుధ

ముండకోపనిషత్తు

అథర్వ వేదములోనిది.

మొదటి ముండకమున

మొదటి ఖండము

శాంతిమంత్రము దండకము

ఓమ్

చెవులచే భద్రముల్ విందు మాదైవభావంబులన్ బొందుచున్ గండ్లతో భద్రముల్ చూతు మాయజ్ఞశీలంబుతో నిశ్చలంబైన యంగంబులన్ దేహ మంత్రాలతో స్తోత్రముల్ చేతు మెల్లప్పుడున్ దేవుల్ ప్రసాదించు దీర్ఘాయువుల్ గల్గుతన్ మాకిలన్

మాకున్ శుభంబిచ్చుతన్ బెద్దలన్ భక్తినాలించు నింద్రుండు
మాకున్ శుభంబిచ్చుతన్ సర్వవేదుండు సూర్యుండు
మాకు (కున్ + అ) న్న హింసాపథుండౌ గరుత్మంతుఁడిచ్చున్ శుభంబుల్
సురాచార్యుఁడిచ్చున్ శుభంబుల్ సదా॥

ఓమ్

శాంతి శ్శాంతిశ్శాంతిః



బ్రహ్మ దేవానాం ప్రథమః సంబభూవ విశ్వస్య కర్తా భువనస్య గోప్తా
స బ్రహ్మ విద్యాయాం సర్వవిద్యాప్రతిష్ఠా మథర్వాయ జ్యేష్ఠపుత్రాయ ప్రాహ.

ప్రపంచ సృష్టికర్తయుఁ బ్రపంచపాలకుఁడు నగు బ్రహ్మ దేవతలలో మొదటివాఁ డయి యుండెను. అతఁడు అన్నివిద్యలకు నాధార మైన బ్రహ్మ విద్యను పెద్దకుమారుఁడైన యథర్వునికిఁ జెప్పెను.

అథర్వణే యాం ప్రవదేత బ్రహ్మాఽథర్వా తాం పురోవా చాంగిరే బ్రహ్మవిద్యాం
స భారద్వాజాయ సత్యవాహాయ ప్రాహ, భారద్వాజోఽంగిరసే పరావరాం

బ్రహ్మ యేబ్రహ్మవిద్యను అథర్వునికిఁ జెప్పెనో యా విద్యను అథర్వుఁడు అంగిరునికి జెప్పెను. అతఁడు భరద్వాజ వంశస్థుఁ డైన సత్యవహునికి అతఁడు పరా పరరూప సర్వవిద్యను అంగీరసునికిఁ జెప్పెను.

శౌనకో హ వై మహాశాలోఽ గిరసం విధివ దుపసన్నః పప్రచ్ఛ
కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వ మిదం విజ్ఞాతం భవతీతి॥

మహా గృహస్థుఁడైన శౌనకుఁడు అంగిరసుని యథావిధిగఁ జేరి యడిగెను. "భగవానుఁడా! ఏది తెలుసుకొన్నచో నిదియంత యుఁ దెలియును" అని

తస్మై స హోవాచ ద్వే విద్యే వేదితవ్యే ఇతి హ స్మ
యద్బ్రహ్మ విదో వదంతి పరా చైవాఽపరా చేతి॥

శౌనకునకు అంగిరసుఁ డిట్లు చెప్పెను. "పర అపర అను రెండువిద్యలు తెలుసుకొనఁదగిన వని బ్రహ్మవేత్తలు చెప్పుచున్నారు"

తత్రాపరా ఋగ్వేదో యజుర్వేదః సామవేదో ఽథర్వవేదః
శిక్షా కల్పో వ్యాకరణం నిరుక్తం ఛందో జ్యోతిష మితి
అథ పరా యయా తదక్షర మధిగమ్యతే॥

అందు ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము శిక్ష కల్పము వ్యాకరణము, నిరుక్తము. ఛందస్సు, జ్యోతిషము అనునవి. అపర విద్య యనఁబడు మఱి క్షరముకాని బ్రహ్మమును తెల్పునది పర యనఁబడును.

యత్తదద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః శ్రోత్రం తదపాణిపాదం నిత్య
విభుంసర్వగతంసు సూక్ష్మంతదవ్యయం,యద్భూతయోనిం పరిపశ్యంతిధీరాః॥

భువనముల సృజించియు వానిఁ బ్రోచుబ్రహ్మ
దేవతలలోనఁ బ్రథముఁడై దీప్తిచెందె
విద్యలకు మూల మౌబ్రహ్మవిద్య నతఁడు
జ్యేష్ఠసుతుఁ డథర్వునికి వచించె నంత॥

అవిద్యను అజ్ఞానమును ముండనము (=ఖండనము) చేయునది గాన ముండకోపనిషత్తు అని వ్యుత్పత్తి.

బ్రహ్మయు నథర్వుని కిడిన బ్రహ్మవిద్య
నాయథర్వుఁడు మును చెప్పె నంగిరునకు
అంగిరుఁడును భారద్వాజుఁ డైన సత్య
వహుని కతఁడాంగిరసునకుఁ బ్రకటపఱచె॥

ఒక పెద్దగృహస్థుఁడు శౌ
నకుఁ డాంగిరసుఁ దగఁ జేరి నయమున నడిగెన్
ఇఁక నెది తెలిసిన సకల మె
ఱుక పడునొ యది యెఱిఁగించి బ్రోవు మహాత్మా॥

తరువాత శౌనకున కాం
గిరసుఁడు వివరించి చెప్పెఁ గృపతో నిటులన్
"పర యపర యనెడు విద్యల్
ధరఁ దెలియఁదగిన వండ్రు బ్రహ్మజ్ఞానుల్॥

వినుము ఋగ్వేదమును యజుర్వేదంబు సామవేద
మాయథర్వవేదము శిక్ష వ్యాకరణము నిరుక్త
ఛందసులు కల్పమును జ్యోతిష మపరవిద్య యండ్రు
అక్షర బ్రహ్మమును జేర్చునది పరవిద్య యండ్రు॥

శిక్ష=ఉచ్చారణాది బోధకవేదాంగము కల్పము=వైదిక క్రియాకలాప బోధకము. నిరుక్తము=వేదవాక్యార్థ ప్రకారబోధకము. ఛందస్సు=వైదిక ఛందస్సు

అది యరయరానిది, యగ్రాహ్యమైనది. కులము జాతి
లే నిది కనులు చెవులు కాళ్ళేతులు లేక నిత్య

అది దర్శింపరానిది. గ్రహింపరానిది. గోత్రము, వర్ణము, కన్నులు చెవులు లేనిది. కాలుచేతులు లేనిది. నిత్యమైనది, అంతటను నున్నది. సూక్ష్మమైనది. మార్పులేనిది. ప్రాణులకు కారణమైనది; దానిని ధీరులు సర్వప్రాణులకు కారణమునుగా చూచుచున్నారు.

యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యా మోషధయః
సంభవంతి, యథా సతః పురుషాత్ కేశలోమాని, తథా క్షరాత్ సంభవతీహ విశ్వం

సాలెపురుగు కావలసినపుడు నూలును వెలికి వదలుచు మ్రింగి లోనికిఁ గొనుచుండునట్లు, భూమియందు ఓషధులు బయలుదేఱుచున్నట్లు జీవించియున్న పురుషునుండి జుట్టువెంట్రుకలు పుట్టునట్లు అక్షరబ్రహ్మము నుండి ఈ విశ్వమంతయు బయలుదేఱుచున్నది.

తపసా చీయతే బ్రహ్మ తతోఽన్న మభిజాయతే
అన్నాత్ ప్రాణో మనః సత్యం లోకాః కర్మసు చామృతం॥

ఉత్పత్తి విధిని దెలిసినజ్ఞానముచే జగత్తును సృష్టింపఁ దలఁచు బ్రహ్మము ప్రకటమగుచున్నది. ఆ బ్రహ్మమునుండి యన్నము పుట్టుచున్నది. అన్నము నుండి ప్రాణము ప్రాణమునుండి మనస్సు మనస్సునుండి సత్యము, లోకములు, లోకములనుండి కర్మలు, కర్మలనుండి అమృతము బయలుదేఱుచున్నవి.

యః సర్వజ్ఞః సర్వవిద్ యస్య జ్ఞాన మయం తపః
తస్మా దేత ద్బ్రహ్మ నామరూప మన్నం చ జాయతే॥

ఎవఁడు సామాన్యముగా సర్వము దెలిసినవాఁడో విశేషముగను సత్యము తెలిసినవాఁడో ఎవని తపస్సు జ్ఞానరూపమైనదో యట్టివానినుండి కార్యరూపమైన యీ బ్రహ్మమును బ్రహ్మమునుండి పేర్లు రూపము అన్నమును బుట్టుచున్నవి.

ఇతి

ప్రథమః ఖండః

మై, వివిధమై సకల, జగద్వ్యాపకమై సుసూక్ష్మ
మవ్యయ మయి భూతాశ్రయ మగు ధీరులద్దాని గాంత్రు.

ఇది పరా విద్యావివరణము. ఇందు క్షరముగాని బ్రహ్మస్వరూపము చెప్పఁబడెను.

ఎటుల సాలెపురుగు నూల్ సృజించు గ్రింగు
భూమి నెట్టుల నోషధుల్ పుట్టు వొందు
మనుజు లందెటు కేశరోమములు పొడము
నటులె యక్షరును డి యీయఖిల మొదవు॥

సాలెపురుగు భూమియుఁ దమకంటె భిన్నముగాని దారములను చెట్లుచేమలను ఎట్టికారణము లేకుండనె సృజించు నట్లును, పురుషునుండి విలక్షణ మైన కేశ రోమములు పుట్టినట్లును నిమిత్తములేకుండ సలక్షణ విలక్షణ వస్తువులు అక్షరు నుండి బయలుదేఱుననిభావము.

తపసుచే బ్రహ్మము స్ఫురించె, దానియం దన్న మొదవె
అన్నమునఁ బ్రాణ మాప్రాణమందు మనస్సు, మదిని
సత్తులగు పంచభూతముల్ జగములువానియందు.
జగములను గర్మ, లాకర్మలఁ గలుగు నమృతఫలము॥

కల్పకోటి శతములవఱకును గర్మలు నశింపకుండ నుండును గాన ఆకర్మఫలమును నశింపదు గాన అమృత మని చెప్పఁబడెను.

ఎవ్వఁడు సమష్టిగను వ్యష్టి నెల్లఁ దెలియు
వేనితపము జ్ఞానమయంబొ వానినుండి
యీ హిరణ్యగర్భబ్రహ్మ, మిందునుండి
పేర్లు రూప మన్నంబు లావిర్భవించె॥

నామరూపాదులు లేని బ్రహ్మమునుండి నామరూపాదులు గలహిరణ్య గర్భ బ్రహ్మమును ఆ బ్రహ్మమునుండి నామాదులు పుట్టుచున్న వని భావము.

ఇది

మొదటి ఖండము

## అథ

## ప్రథమముండకే ద్వితీయః ఖండః

తదేత్ సత్యం—మంత్రేషు కర్మాణి కవయో యా న్యపశ్యం
స్తాని త్రేతాయాం బహుధా సంతతాని, తా న్యాచరథ నిత్యం
సత్యకామా, ఏష నః పంథాః సుకృతస్య లోకే॥

వేదమంత్రములందుఁ గవు లేకర్మలను దర్శించిరో యవి హోత అధ్వ ర్యుడు ఉద్గాత యను ముగ్గురు ఋత్విక్కులచేఁ జేయఁబడు యజ్ఞసంహితయందు అనేక విధములుగా వ్యాపించియున్నవి మీరు సత్యకాము లయి వానిని దప్పక యాచరింపుఁడు. మీరుచేయు సత్కర్మయొక్క ఫలము పొందుటకు ఇదియే మార్గము. ఇది సత్యము.

యదా లేలాయతే హ్యర్చిః సమిద్ధే హవ్యవాహనే
తదాజ్యభాగా వంతరే ణాఽఽహుతీః ప్రతిపాదయేత్॥

సమిధలచేత అగ్ని మండఁగా జ్వాలలెపుడు కదలునో యప్పుడు దక్షిణోత్తర దిక్కులమధ్య వెల్చు నేతులకు మధ్య ఆహుతుల నర్పించవలెను.

యస్యాగ్నిహోత్ర మదర్శ మపౌర్ణమాస చాతుర్మాస్య మనాగ్రయణ మతిథి వర్జితంచ, అహుత మవైశ్వదేవ మవిధినాహుత మాసప్తమాం స్తస్యలోకాన్ హినస్తి॥

దర్శ పౌర్ణమాసములు చాతుర్మాస్యలు ఆగ్రయణము అతిథులు లేనిదై కాలమున హోమము చేయఁబడనిదై వైశ్వదేవము లేనిదై యథాశాస్త్రముగా హోమము చేయబడనిదై యెవనియింట అగ్నిహోత్రము ఉండునో అట్టి యగ్నిహోత్రము వానియొక్క ఏడులోకములను నశింపజేయును.

కాళీ కరాళీ చ మనోజవా చ, సులోహితా యాచసుధూమ్రవర్ణా
స్ఫులింగినీ విశ్వరుచీ చ దేవీ, లేలాయమానా ఇతి సప్తజిహ్వాః

ఇంక

## మొదటి ముండకమున రెంతవ ఖండము

కర్మ లెవి వేదమంత్రాలఁ గవులు గన్గొనిరొ యవ్వి
త్రేత సంహితఁ జాలవ్యాప్తిని జెందె మీరు సత్య
కాములై యవశ్యము వీనిఁ గావింపుఁ డివియె మీరొ
నర్చు కర్మల ఫలమొంద నగుమార్గ; మిది నిజంబు

ఇపుడు అపరవిద్యోపాసకుల విషయము చెప్పఁబడుచున్నది.

త్రేత సంహిత = హోత, అధ్వర్యుఁడు, ఉద్గాత యనుముగ్గురు ఋత్విక్కులు చేయు యజ్ఞక్రియ. ఋగ్వేదమంత్రములచేఁ గర్మలను జేయించువాఁడు హోత యజుర్వేద మంత్రములచేఁ గర్మలను జేయించువాఁడు అధ్వర్యుఁడు. సామ వేదమంత్రములచేఁ గర్మలను జేయించువాఁడు ఉద్గాత.

మఱి హుతవహుండు బాగుగ నుండుచుండ
నెపుడు వీతిహోత్రుని జ్వాల లెగయుఁ బైకి
నపుడె దక్షిణోత్తర దిక్కులందు వ్రేల్చు
నేతులకు మధ్య నాహుతుల్ నింపవలయు॥

వహ్నియెవనింట దర్శ పౌర్ణమాసములు లేక
ఆగ్రయణము చాతుర్మాస్య లతిథులులేక వైశ్వ
దేవహోమముల్ లేక శాస్త్రీయ హుతము గాదొ
యిది యతని పుణ్యలోకంబు లేడింటివరకుఁ గూల్చు ॥

దర్శ పౌర్ణమాసములు = ఆమావాస్య పౌర్ణములలోఁ జేయుకర్మలు. ఆగ్రయణము = శరదాదులందు నూతనాన్నముతోఁ జేయు కర్మ. చాతుర్మాస్యలు = వర్షాఋతువున నాలుగు మాసములొకచోటనే యుండి చేయుకర్మ. అతిథి = తిథికంటెనుండక వేళకు భోజనమునకువచ్చువాఁడు. వైశ్వదేవము = సమస్తదేవతలకై బలియర్పించు కర్మ. హోమము = ఆజ్యాహుతు లర్పించి చేయుకర్మ. ధర హవిసును గొనఁ గాళియుఁ
గరాళియు, మనోజవయు, నిఁక సులోహిత, వి

౧) కాళి, ౨) కరాళి, ౩) మనోజవ, ౪) సులోహిత, ౫) ధూమ్రవర్ణ. ౬) స్ఫులింగిని, ౭) ప్రకాశించెడు విశ్వరుచి అని యీ యేడును ఇటునటు కదలెడి యగ్నియొక్క జ్వాలలు.

ఏతేషు యశ్చరతే భ్రాజమానేషు, యథా కాలం చాహుతయో హ్యాదదాయన్
త న్నయత్యేతాః సూర్యస్య రశ్మయో, యత్రదేవానాం పతిరేకోఽ ధివాసః॥

ఈ యగ్నిజ్వాలలు ప్రకాశించుచుండఁగా నెవఁడు కర్మలు చేయునో వానిని తగిన కాలములో ఆయాహుతులు పైకిఁదీసికొని పోవుచున్నవై సూర్యరశ్మల ద్వారా దేవపతి నివసించుచోటికిఁ దీసుకొని పోవును.

ఏహ్యేహీతి తమాహుతయః సువర్చసః సూర్యస్యరశ్మిభి ర్యజమానంవహంతి
ప్రియాంవాచ మభివందత్యోఽర్చయంత్యః
ఏషవః పుణ్యః సుకృతో బ్రహ్మలోకః ॥

ప్రకాశించెడి యాహుతులు రమ్మ రమ్మని ప్రియవాక్యము లాడుచుఁ బూజించుచు "ఇదిగో మీకు మీకర్మవల్లవచ్చిన పుణ్యమైన బ్రహ్మలోకము" అని సూర్యరశ్మలద్వారా అయజమానుని దీసుకొనిపోవును.

ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశో క్త మవరం
యేషుకర్మ, ఏతచ్ఛ్రేయో యేఽభినందంతి మూఢా
జరామృత్యుంతే పునరేవాపి యంతి॥

పదాఱుగురు ఋత్విక్కులు, యజమానుఁడు, భార్యయనెడి యీ పదునెనమండుగురు యజ్ఞరూపమైన నావలు. అస్థిరమైనవి వీరినాశ్రయించి చెప్పఁబడినజ్ఞానహీనమైన కర్మ తక్కువది. దీనినిశ్రేష్ఠముగా నేమూఢులు కొనియాడుదురో వారు మరలఁ జావుపుట్టుకలను బొందుదురు.

అవిద్యా మంతరే వర్తమానాః స్వయంధీరాః పండితం మన్యమానాః
జంఘన్య మానాః పరియంతిమూఢా అంధే నైవనీయమానా యథాంధాః

అవిద్యలో నున్న వారై తాము స్వయముగ ధీరులమని పండితుల మనితలఁచి, గ్రుడ్డివానిచే దారిచూపఁ బడిన గ్రుడ్డివారువలె మూఢులు మిగుల వక్రగతిలోఁ బడి జననమరణ చక్రములఁ బడిపోవుదురు.

శ్వరుచియు, సుధూమ్ర వర్ణయు
స్ఫులింగిని యన శిఖి కేడు చొప్పడు జిహ్వల్ ॥

వివ:- ఇందుజ్వాలలు నాలుకలుగాఁ బోల్పఁబడెను.

ఇవి వెలుంగు చుండఁగఁగర్మ. లెవఁడు చేయు
వానినాహుతుల్ తగువేళఁ బైకిఁ గొనుచు
సూర్య రశ్మలై శ్రేష్ఠమౌ చోట నుండు
దేవపతియున్న జగముఁ బొందించు చుండు ॥

రమ్ము రమ్మిదె పుణ్యలో కమ్మటంచు
వెలుఁగుమీఱెడి యాహుతుల్ ప్రియములాడి
నతులుచేయుచు రవి కిరణముల ద్వార
పైకి యజమానుఁజేర్చును బ్రహ్మపదము॥

వివ:- ప్రకరణమునుబట్టి యిక్కడ బ్రహ్మపదమనఁగా స్వర్గము

ఋత్విజులు బదార్వురు, పత్నియీ యజమానుఁడనెడి
యిప్పదెనమండ్రు యజ్ఞమనతెప్ప లస్థిరము, వీరి
కర్మ హీనంబు; మేలంచుఁగర్మల మెచ్చుజడులు
ధరణి మరలమరల జరామరణముల్ గాంచుచుండ్రు॥

వివ:- ఋతిక్కులు యజమానుఁడు పత్ని వీరిని ఆశ్రయించిన యజ్ఞములు కామ్యకర్మలుగానఁ గొంతకాలము వానిఫలమగు స్వర్గమునుభవించి పిదప ఆ పుణ్యము క్షీణింపఁగా భూమియందుఁబుట్టి చావుఁ పుట్టుకలు పొందుచుందురని భావము.

తామవిద్యలో నుండియుఁదాము ధీరు
లమని పండితులమని తలంచి జడులు
గ్రుడ్డివారిచేఁ గొనిపోవఁబడ్డగ్రుడ్డి
వారువలె భ్రమింతురు తప్పుదారినిబడి॥

వివ:- తప్పుదారినిబడి చావుఁబుట్టుకలను బొందుచుందురని భావము.

అవిద్యాయాం బహుధావర్తమానా వయంకృతార్థా ఇత్యభిమన్యంతి బాలాః
యత్కర్మిణో న ప్రవేదయంతి రాగాత్తేనాఽఽతురాః క్షీణలోకాశ్చ్యవంతే॥

అజ్ఞానమందు అనేకవిధములుగా నున్న మూఢులు "మేము కృతార్థులము" అనితలంతురు. ఎందువలనఁ గర్మపరులు రాగమువల్లఁ దత్త్వమును దెలిసికొనలేరో యందుచేత క్షీణమైన కర్మఫలముగలవారై దుఃఖార్తులై స్వర్గమునుండి పడిపోవుదురు.

ఇష్టాపూర్తం మన్యమానావరిష్ఠం. నాన్యచ్ఛ్రేయో వేదయంతే ప్రమూఢాః
నాకస్య పృష్ఠేతేసుకృతేఽనుభూత్వేమం లోకం హీనతరంవా విశంతి ॥

ఇష్టాపూర్తములనే (యాగాదులు వాపీకూపాదులనె) శ్రేష్ఠమైన వానినిగఁ దలఁచి యితరమైన యాత్మజ్ఞానమును శ్రేష్ఠముగ మూఢులు తలఁపరు. వారు స్వర్గముపైని పుణ్యమునను భవించి పిదప ఈ మర్త్య లోకమునుగాని పశు పక్షి కీట నరకాది హీనలోకమునుగాని బొందుదురు.

తపఃశ్శ్రద్ధే యే హ్యుప వసం త్యరణ్యేశాంతా విద్వాంసో
భైక్ష్య చర్యాం చరంతః, సూర్య ద్వారేణతే విరజాః
ప్రయాంతి యత్రామృతః స పురుషో హ్యవ్యయాత్మా ॥

ఎవరైతే శాంతులై విద్వాంసులై భైక్ష్య చర్యను జరించుచు అరణ్యమందుండి తపస్సును శ్రద్ధను సేవింతురో వారు దోషములను వీడి సూర్యునిద్వారా అమృతుఁడును అవ్యయుఁడునగు పురుషుడున్నచోటికిఁ బోయెదరు.

పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో, నిర్వేదమాయన్నా స్త్యకృతఃకృతేన
తద్విజ్ఞానార్థం సగురు మేవాభిగచ్ఛేత్, సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం॥
కర్మలచేఁగలుగు లోకములను పరీక్షించి బ్రాహ్మణుఁడు ఇందు నిత్యమైనది లేదు కృకర్మచేనేమి లాభమని వైరాగ్యముపొందినవాఁడై దానిని దెలియుటకై దర్భలు చేత ధరించి శ్రుతిసారమెఱిఁగిన, బ్రహ్మనిష్ఠగల గురువునే సమీపింపవలయును.

తస్మై స విద్వా నుపసన్నాయ సమ్యక్, ప్రశాంత చిత్తాయ శమాన్వితాయ
యేనాక్షరం పురుషం వేద సత్యం, ప్రోవాచతాం తత్త్వతో బ్రహ్మవిద్యాం॥

పలువిధముల నవిద్యలో మెలఁగుచుండి
యేమిలఁగృతార్థులమని గర్వింత్రు జడులు
కర్మపరులు రాగమున నిక్కముగను గనక
స్వర్గపతితులౌదురు కర్మఫలముపోవ॥

వివ:- కానఁగేవల కర్మలందు మునుఁగక కర్మలను జ్ఞానమునకు సోపానము లుగ గ్రహింపవలెనని భావము.

ముఖ్యములుగ నిష్టాపూర్తములఁ దలంచి
మందు లాత్మజ్ఞానంబు మదిని గనరు
భోగభూములౌ స్వర్గభూముల భుజించి
మనుజ జన్మమొ హీనజన్మమునొ గాంత్రు॥

వివ:- ఇష్టాపూర్తములు యాగాదులు, వాపీకూపతటాకాదులు.

శాంతులై భిక్షఁ జరియించు జ్ఞానులెపుడు
నడవినుండి శ్రద్ధయుఁదపంబాచరించి
పాపముల వీడి సూర్యునిద్వారఁ బోయి
పొందుదురు స్థిరుండమృతుఁడౌ పురుషపదము॥

వివ:- జ్ఞానులు సర్వపరిగ్రహములను విడిచినవారుగాన భిక్షచే జీవించుచునడవి నుందురని భావము.

కర్మలఁగలుగు జగముల మర్మమరసి
నిత్యమెవ కర్మలెందు కనియువిరక్తి
బ్రాహ్మణుఁడు బ్రహ్మఁగన సమిత్పాణియగుచు
బ్రహ్మపరుశ్రోత్రియు గురునె వడయవలయు॥

వివ:- కర్మపరుఁడు బ్రహ్మనిష్ఠుఁడై యుండుట సంభవింపదుగాన బ్రహ్మనిష్ఠునెపొందవలెనని భావము.

చక్కఁగ బ్రశాంతుఁడై శమముదాల్చి
దరికి వచ్చినవానికిఁ దత్త్వవేత్త

చక్కఁగా సమీపించిన, ప్రశాంతమైన మనస్సుగల, శమముతోఁ గూడిన యాశిష్యునికి అజ్ఞానియైన గురువు ఏ విద్యచే సత్యస్వరూపుఁడును అక్షరుఁడును నైన పురుషుఁడు తెలియఁబడునో యట్టి బ్రహ్మవిద్యను సరిగాఁ జెప్పవలెను.

ఇతి

ప్రథమ ముండకే ద్వితీయః ఖండః



1. ముం. 2. ఖం. ముండకోపనిషత్తు

క్షరముగాని సత్యాత్మునిఁబురుషుఁదెల్పు
బ్రహ్మవిద్య సరిగబోధ పఱుపవలయు॥

వివ:- అర్హుఁడై వచ్చిన శిష్యునికి విద్యచెప్పుట గురువు కర్తవ్యమని భావము.

ఇది

మొదటి ముండకమున రెండవఖండము.

## ద్వితీయ ముండకే ప్రథమః ఖండః

తదేతత్సత్యం— యథా సుదీప్తా త్పావకాద్విస్ఫులింగాః
సహస్రశః ప్రభవంతే సరూపాః, తథా ఽక్షరాద్వివిధాః
సోమ్య! భావాః ప్రజాయంతే తత్ర చైవాఽపి యంతి ॥

సౌమ్యుఁడా! బాగుగామండు నిప్పునుండి వేలకొలఁది సమానరూపము లైన నెఱసులెట్లు పుట్టుచున్నవో యట్లే యక్షరునుండి వివిధములైన భావములు పుట్టుచున్నవి, మఱి యందే విలీనమగుచున్నవి, ఇది నిజము.

దివ్యోహ్య మూర్తః పురుషః, సబాహ్యా భ్యంతరో హ్యజః
అప్రాణో హ్యమనాః శుభ్రో, హ్యాక్షరాత్పరతః పరః

అతఁడు దివ్యుఁడు, స్వరూపములేని వాఁడు హృదయపురమునన్న వాఁడు. వెలుపల లోపలనున్నవాఁడు. పుట్టుకలేనివాఁడు. ప్రాణములేనివాఁడు. మనస్సులేనివాఁడు పరిశుద్ధుఁడు అక్షరుకంటెను పరునికంటెను బరుఁడైన వాఁడు.

ఏతస్మా జ్జాయతే ప్రాణోమనః సర్వేంద్రి యాణిచ
ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీ విశ్వస్య ధారిణీ

ఇతనినుండి ప్రాణము మనస్సు అన్ని యింద్రియములు, ఆకాశము, గాలి జ్యోతిస్సు, నీరు, విశ్వమును ధరించుభూమియుఁ బుట్టుచున్నవి.

అగ్నిర్మూర్ధా, చక్షుషీచంద్రసూర్యౌ, దిశఃశ్రోత్రే, వాగ్వివృతాశ్చవేదాః
వాయుఃప్రాణో, హృదయం విశ్వ మస్యపద్భ్యాం
పృథివీహ్యేష సర్వభూతాంతరాత్మా

ఇతని తల అగ్ని (=ద్యులోకము. అసౌవావలోకో గౌతమాగ్నిః అను శ్రుతులబట్టి) కన్నులు సూర్యచంద్రులు, చెవులు దిక్కులు, వాక్కు ప్రసిద్ధ మైన వేదములు, ప్రాణముగాలి హృదయము ప్రపంచము. ఇతనికాళ్లనుండి భూమిపుట్టెను, ఇతఁడన్ని ప్రాణులలోన నున్నవాఁడు.

## రెండవముండకమున మొదటిఖండము.

కరము మండు నిప్పున నుండి నెఱసులెట్లు
వేనవేలొక్క రూపముపూని పొడము
అటులెసౌమ్య! యక్షరునుండి యంతులేని
ప్రాణులొదవి యందడఁగు నియ్యదినిజంబు॥

వివ:- ఇంతవరకు అపరవిద్యయొక్క కార్యములన్నియుఁ జెప్పఁబడెను. ఇంక పరవిద్య విషయము చెప్పఁబడుచున్నది.

పూరుషుండమూర్తుండు దివ్యుఁడు నజుండు
అన్నిటికి వెలుపలలోన నున్నవాఁడు
ప్రాణచిత్త శూన్యుఁడు, శుభ్రమైనవాఁడు
అక్షర ప్రకృతికిఁ బరుకన్నఁ బరుఁడు॥

వివ:- అక్షరప్రకృతికి నామరూప బీజోపాధిలక్షిత స్వరూపముకంటె..
పరుకన్న=నామరూపరహిత స్వరూపముకంటె.

ఇతనివలన ప్రాణ మఖిలేంద్రియంబులు
మనసు నాకసంబు ననిలమగ్ని
జలము మఱియు నెపుడు జగమెల్ల ధరియించు
భూతలంబుగూడఁ, బుట్టుచుండు॥

ఇతని తలద్యులోకము, కన్నులిందురవులు
ఇతనిచెవులు దిక్కులు, వాక్కులుశ్రుతిగణంబు
ఇతని ప్రాణమువాయువు, హృదిజగంబు
అవనియితనికాళ్లితఁడు సర్వాంతరాత్మ॥

వివ:- ఇందుఁ బరమేశ్వరుని బ్రహ్మమైన విశ్వరూపము చూపఁబడిది.

తస్మా దగ్నిః సమిధోయస్య సూర్యః, సోమాత్పర్జన్య ఓషధయః పృథివ్యాం
పుమాన్ రేతః సించతి యోషితాయాం, బహ్వీః ప్రజాః పురుషాత్సంప్రసూతాః

అతనినుండి యగ్ని (ద్యులోకము) పుట్టెను. దానికి సూర్యుఁడు సమిధ వంటివాఁడు. ఆద్యులోకమందలి సోమునినుండి మేఘమును మేఘమునుండి ఓషధులు భూమియందుఁబుట్టెను. ఆయోషధులనుబట్టి పురుషుఁడు స్త్రీయందు వీర్యము నిలుపుచున్నాఁడు, ఇట్లు పురుషునివల్లఁ జాల ప్రజలుపుట్టిరి.

తస్మాదృచః సామ యజూంషి దీక్షా యజ్ఞాశ్చ సర్వేక్రతవో దక్షిణాశ్చ
సంవత్సరశ్చ యజమానశ్చ లోకాః సోమోపవతే యత్రసూర్యః

అతనినుండి ఋక్కులు, సామలు, యజుస్సులు, దీక్షలు, యజ్ఞములు, యూపస్తంభములతోడి క్రతువులు, దక్షిణలు, సంవత్సరము, యజమానుఁడు, లోకములును పుట్టెను. ఆలోకములను సోముఁడు సూర్యుఁడు పవిత్రము చేయుచున్నారు.

తస్మాచ్చదేవా బహుధా సంప్రసూతాః, సాధ్యా మనుష్యాః పశవోవయాంసి
ప్రాణాపానౌ వ్రీహియవౌ తపశ్చ, శ్రద్ధాసత్యం బ్రహ్మచర్యం విధిశ్చ

అతనినుండి దేవతలు, సాధ్యులు, మనుష్యులు పశువులు పక్షులు ప్రాణాపానములు వ్రీహులు యవలు తపస్సు శ్రద్ధసత్యము బ్రహ్మచర్యము విధియు అనేకవిధములుగఁ బుట్టినవి.

సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్, సప్తార్చిషః సమిధః సప్తహోమాః
సప్త ఇమే లోకాః యేషు చరంతి, ప్రాణాగుహాశయా నిహితాః సప్తసప్త

అతనినుండి కన్ను మొదలగు ప్రాణలేడును, వానిదీప్తులేడును, ఈయింద్రియ విషయములనెడి సమిధలేడును, వీని విషయ విజ్ఞానములనెడి హోమములేడును ఈ యింద్రియ విషయములనెడి లోకములేడును పుట్టుచున్నవి. వీనియందు హృదయ గుహయందున్న ప్రాణములు ఏడు ఏడుగా సంచరించుచున్నవి.

అతః సముద్రా గిరయశ్చ సర్వేఽస్మాత్స్యందంతే సింధవః సర్వరూపాః
అతశ్చ సర్వాఓషధయో రసశ్చయే నైష భూతైస్తిష్ఠతేహ్యంతరాత్మా ॥

ఇతనినుండి లవణాది సముద్రములు, హిమాలయాది సర్వపర్వతములు, బయలుదేఱుచున్నవి. గంగాదినదులనేక రూపములై ప్రవహించుచున్నవి. ఇతనినుండి వడ్లు యవలు మొదలయిన యోషధులు, మధురాది రసములు పుట్టుచున్నవి. ఇట్టిరసముచే భూతములచేఁ జుట్టుకొనఁబడి యంతరాత్మయై యున్నాఁడు.

అతనినుండి యగ్నిపొడమె నగ్నికి సమిధ సూర్యుఁ
డతనిచేవెల్గు దివిఁజంద్రుఁ, డాచంద్రునుండి మబ్బు,
మబ్బునుండి యోషధులు, తన్మహిమచేఁ బురుషుఁడింతి
యందునిడె వీర్య, మిట్లుప్రజలయిరి యాపురుషునుండి॥

ద్యులోకము, మేఘము, భూమి, పురుషుఁడు, స్త్రీ అను పంచాగ్నులద్వారా ఆపరమ పురుషునుండి ప్రాణులుద్భవించెనని భావము.

అతనినుండి ఋక్కులు సామతపసు, దీక్ష
క్షతువులు సమస్త యజ్ఞముల్ దక్షిణలును
కాలము యజమానుఁడును లోకములుఁబుట్టె
సూర్యచంద్రు లా లోకముల శుద్ధపరచు॥

ఆ పురుషునుండియు ననేకమైనగతుల
సురలు, సాధ్యులు, నరులు, పక్షులును బసులు
ప్రాణము నపానమును, వడ్లుయవలు తపము
శ్రద్ధ విధిబ్రహ్మచర్యము సత్యమొదవె॥

అతనినుండి ప్రాణములేడు, నర్చులేడు
సమిధలేడు, హోమములేడు జగములేడు
వఱలు; హృదయంపు గుహలోనఁ బాణములును
నమరి యేడేడుగా విహారములు సల్పు॥

రెండుకన్నులు, రెండుముక్కులు, రెండుచెవులు నోరుఒకటియీ యేడును ప్రాణములు. వీనిదీప్తులు అర్చులుగను విషయములు సమిధలుగను విజ్ఞానములు హోమములుగను స్థానములుగను బోల్చబడెను.

పురుషునుండి సంద్రము, లెన్నొగిరులు పొడమెః
బలురసము లోషధులు నదుల్ బయలువెడలె
రసమునిండార భూతఃబులావరింప
నఖిలమున కంతరాత్మయై యతఁడువెలిఁగె ॥

వివ:- అతఁడు సర్వశరీరములందు లింగశరీరమై యంతరాళమున శరీరమునకు ఆత్మకును ఆత్మవలెనుండునని భావము.

పురుష ఏ వేదం విశ్వంకర్మ తపోబ్రహ్మ పరామృతం, ఏతద్యోవేద
నిహితం గుహాయాం సోఽవిద్యా గ్రంథింవికిర తీహసోమ్య ॥

సౌమ్యుఁడా! కర్మ, తపస్సు, బ్రహ్మము పరమమోక్షము ఇది యంతయుఁ బురుషుఁడె. హృదయ గుహయందున్న యీపురుషుని దెలిసిన వాఁడు ఇహలోకమందె యవిద్యాపాశమును ద్రెంచివైచును.

ఇతి

ద్వితీయముండకే ప్రథమః ఖండః



తపము, కర్మ, బ్రహమును నుత్తమమునైన
మోక్షమీసమస్తముగూడఁ బూరుషుండె
హృదయగుహనుండు నాతని నెఱుఁగువాఁడు
సౌమ్య! యిందె యవిద్యపాశములఁ ద్రెంచు ॥

వివ:- పురుషుని నెఱిఁగినవాఁడు అవిద్యనశింపఁ జేసికొనును. అవిద్య నశింప జేసికొన్నవాఁడె పురుషుని దెలిసినవానిగ గ్రహింపవలెనని భావము.

ఇది

రెండవ ముండకమున మొదటిఖండము



అథ

## ద్వితీయ ముండకే ద్వితీయః ఖండః

ఆవిః సన్నిహితం గుహాచరంనామ, మహత్పద మత్రైతత్సమర్పితం
ఏజత్ప్రాణ న్నిమిషచ్చయ దేవతజ్జానథ, సదసద్వరేణ్యం ప రం
విజ్ఞానాద్య ద్వరిష్ఠం ప్రజా నాం.

ఆ బ్రహ్మము ప్రకాశించునది, దగ్గఅనున్నది, హృదయగృహను జరించునదియను పేరుగలది. మహాపదముగలది, దీనియందే యన్నియున్నవి. ఇది బ్రతుకుగలది, ఱెప్పపాటుగలది. దీనిని సత్తుగాను అసత్తుగాను పూజింపఁ దగినదానినిగను ప్రజల విజ్ఞానముకంటె వేఱై అన్నిటికంటె శ్రేష్ఠమైన దానినిగాఁ తెలిసికొనుఁడు.

యదర్చిమద్య దణుభ్యోణుచ యస్మింల్లోకా నిహితా లోకినశ్చ
తదేత దక్షరం బ్రహ్మ సప్రాణ స్తదు వాఙ్మనః తతేత్సత్యం
తదమృతం తద్వే ద్ధవ్యం సోమ్య విద్ధి॥

ఏది దీప్తిగలదో, అణువులకంటె నణువుగాఁ గూడనున్నదో, దేని యందు లోకములు లోకులు నుండిరో ఆ యీ యక్షరమె బ్రహ్మము. అదె ప్రాణము, అదె వాక్కు మనస్సును, ఇదే సత్యము, అదే యమృతము సౌమ్యుఁడా ! అది మనసుచేఁ గొట్టఁదగినది. దానిని మనసుచేఁ గొట్టుము.

ధనుర్గృహీత్వో పనిషదం మహాస్త్రం శరంహ్యుపాసనిశితం సంధయీత
ఆయమ్య తద్భావ గతేన చేతసా, లక్ష్యంత దేవాక్షరం సోమ్యవిద్ధి॥

ఉపనిషత్తులందుఁ బ్రసిద్ధమైన, గొప్పయస్త్రములుగల ధనుస్సును గ్రహించి యుపాసనచేత వాడియైన బాణము నెక్కుపెట్టుఁడు. ఆబాణమును లాగి యాబ్రహ్మభావన యందలి మనస్సుచేత ఓసౌమ్యుఁడా లక్ష్యమైన యక్షర బ్రహ్మమునుగొట్టుము.

## ఓంత

## రెండవముండకమున రెండవఖండము

మెఱయునది, దగ్గఱది, హృదిన్ జరింపఁ బేర్వడినది
గొప్పది, కదలిక బ్రతుకు ఱెప్పపాటొప్పు ప్రాణు
లన్నిగలది. సత్తునసత్తునైనది; కోరఁదగిన
దైహిక జ్ఞానమును దాటునదియైన; యాత్మఁగనుఁడు ॥

వివ:- ఇందునామరూపాలులేక క్షరముగాని యాపరమాత్మ యెట్లుచూడఁ బడునో చెప్పఁబడుచున్నది. అలంకారముల బాహ్యరూపము లనేకముగనున్నను లోపలిబంగారమొకటేయైనట్లు సర్వ ప్రాణులలోపలనున్నది యాత్మయేయని భావము.

ఆది మెఱయునది యణువున కన్నను నణువుగూడ
అందెలోకముల్ ప్రజలుందు, రక్షబ్రహ్మమదియె
ప్రాణమదె, వాఙ్మనసులదె, యమృతంబు సత్యమదియె
మనసుచేత గొట్టఁదగినది మఱికొట్టుమిపుడె సౌమ్య ! ॥

వివ:- అణువుకన్నను అణువుగూడ, అనికూడ అనుటచే గొప్పదానికంటె గొప్పదియనికూడఁ దెలిసికొనవలెను. మనసుచేఁగొట్టుము అనఁగా అట్టియక్షర బ్రహ్మమందు మనస్సును నిశ్చలముగా నుంచుమని భావము.

అనుపమాస్త్ర మౌపనిషద ధనువుదాల్చి
సంతతధ్యాన నిశితమౌ శరముఁగూర్చి
బ్రహ్మ భావించుమనసుచే లాగికొట్టు
మట్టిలక్ష్యమౌ నక్షరాత్మమును సౌమ్య ! ॥

వివ:- ఔపనిషదము=ఉపనిషత్తులందుఁ బ్రసిద్ధమైనది. లాగికొట్టు= తమ విషయములనుండి యింద్రియములను లాగిధ్యానింపుమని భావము.

ప్రణవోధనుః శరోహ్యాత్మా, బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్॥

ఓంకారము ధనుస్సు, ఆత్మ బాణము, దానికి లక్ష్యము బ్రహ్మము అని చెప్పఁబడుచున్నది. ప్రమాదములేనివానిచేఁ గొట్టఁదగును. బాణము లక్ష్య రూపముపొందినట్లు ఆసాధకుఁడు బ్రహ్మతాదాత్మ్య మొందును.

యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం మనః సహప్రాణైశ్చసర్వైః,
తమే వైకం జానథ ఆత్మాన, మన్యావాచోవిఽముంచథా మృతస్యైష సేతుః

ఏయక్షరబ్రహ్మ మందు దివము, భూమి, అంతరిక్షము సర్వప్రాణ ములతోఁ గూడ మనస్సును నిలిచియున్నదో ఆయాత్మ నొకదానినే తెలిసి కొనుఁడు. ఇతర వాక్కులను వదలుఁడు. ఇదేమోక్షమునకు వంతెన.

అరా ఇవరథ నాభౌ సంహతా యత్ర నాడ్యః స ఏషోఽంత
శ్చరతే బహుధా జాయమానః, ఓమిత్యేవం ధ్యాయథ
ఆత్మానం స్వస్తి వః పరాయ తమసః పరస్తాత్॥

బండి నాభియందు ఆకులవలె ఎచ్చట నాడులు గలిసియున్నవో యా హృదయాంతరాళమందె యీ పురుషుఁడు పలువిధములుగాఁ బుట్టి చరించును. ఓం అని యిట్లు ఆత్మను ధ్యానింపుఁడు తమస్సునుదాటి యవతల నొడ్డును బొందుటకు మీకు శుభముగుఁగాక.

యః సర్వజ్ఞః సర్వ విద్యస్యైష మహిమా భువి, దివ్యేబ్రహ్మపురే
హ్యేష వ్యోమ్న్యాత్మా పతిష్ఠితః। మనో మయః ప్రాణశరీర నేతా
ప్రతిష్ఠితోఽన్నే హృదయం సన్నిధాయ తద్విజ్ఞానేన పరిపశ్యంతి
ధీరా ఆనంద రూప మమృతం యద్విభాతి॥

ఎవఁడు సామాన్యముగ సర్వమును దెలిసినవాఁడో యెవండు విశేషము గను సర్వము దెలిసినవాఁడో భూమి యందలి యీ మహిమ ఎవనిదో యట్టి యీయాత్మఁడు దివ్యమైన బ్రహ్మపురమైన యీ హృదయా కాశమందున్నాఁడు ప్రాణ శరీరములను నడుపువాఁడయి యన్నమందు బుద్ధిని నిలిపియుండెను. ఆనందరూపమై యమృతమై ప్రకాశించుదానిని విజ్ఞానముచే ధీరులు చూచు చున్నారు.

ప్రణవమైన యోంకారంబు ధనువుసుమ్మి
ఆత్మశరము, కొట్టఁదగులక్ష్యంబు బ్రహ్మ
ఎట్టి భ్రమలేని వాఁడయి కొట్టవలయు
నతఁడు శరమట్టు బ్రహ్మతాదాత్మ్యి మొందు ।

వివ:- ఆత్మయందు దేహాదిభ్రాంతిపోఁగా బ్రహ్మరూపమొందునని భావము.

అక్షరబ్రహ్మమున భూమియాకాసంబు
అంతరిక్షము, మనసెల్ల ప్రాణములును
నిలుచు నాయాత్మనొక్కటే తెలిసికొనుఁడు
ముక్తికిదె వంతెన, విడుఁడన్యోక్తులెల్ల ॥

వివ:- అక్షరబ్రహ్మము లక్షింపరానిదిగాన సులభముగాఁ దెలియుటకు మాటి మాటికిట్లు చెప్పఁబడుచున్నది.

బండినాభి నాకులువోలె వఱలినాడు
లుండు హృదినాత్మ పల్గతి నొదవి తిరుగు,
ఆత్మ ధ్యానింపుఁడిటులఓం మని, తమస్సు
గడచి యాదరిఁజేర మీకగునుశుభము ॥

వివ:- ఆయాత్మ హృదయమందుండి చూచుచు, వినుచు, తలఁచుచు తెలిసి కొనుచు అన్నికర్మలు చేయుచు కామక్రోధాది ప్రత్యయములవల్ల బుట్టుచున్నది వలె లోకులచే జూడబడుచున్నదని భావము.

అన్ని తెలియు నాత్మమహిమ యవనివ్యాపించె, బ్రహ్మ
నగరమౌ దివ్యహృద్గుహనదియుండె; హృదినినన్న
మందునిల్చి చిత్తమయమై ప్రాణదేహముల నడపు,
జ్ఞాను లిదితెల్సి దివ్యమానందామృతాత్మఁ గాంత్రు ॥

వివ:- భూమ్యాకాశములు సూర్యచంద్రులు నదులుసముద్రములు స్థావర జంగములు ఋతువులు అయనములు సంవత్సరములు అన్నియునతని శాసనమును బట్టినడచును. ఇట్లేకర్తలు కర్మలు ఫలము తను తమ కాలమును అతిక్రమింపక యతని, శాసనమున నడచును. ఇది యంతయు అత్మమహిమయే.

భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వ సంశయాః.
క్షీయంతే చాస్య కర్మాణి, తస్మిన్ దృష్టే పరావరే ॥

కారణ రూపమునఁ బరమై కార్యరూపమున అవరమైయున్న యాత్మ చూడఁ బడఁగా హృదయమందలి ముడివిడిపోవును. సంశయములన్ని తెగి పోవును ఇతని కర్మలన్నియు క్షీణించును.

హిరణ్మయే పరేకోశే విరజంబ్రహ్మ నిష్కలం
తచ్ఛుభ్రం జ్యోతిషాం జ్యోతి స్తద్య దాత్మవిదోవిదుః

బంగారమువంటి శ్రేష్ఠమైన యాత్మకోశమందు అవిద్యాది దోషములు లేని యవయవములులేని బ్రహ్మమున్నది. అది శుద్ధమైనది జ్యోతిస్సులకును జ్యోతిస్సు దానిని ఆత్మవేత్తలు తెలిసికొందురు.

నతత్ర సూర్యోభాతి నచంద్రతారకం నే మా విద్యుతో భాంతి
కుతోఽయమగ్నిః, తమేవ భాంత మను భాతి సర్వం
తస్యభాసా సర్వ మిదం విభాతి॥

ఆ బ్రహ్మ సమీపమున సూర్యుఁడు వెలుఁగఁడు, చంద్రుఁడు నక్షత్రములు వెలుఁగవు. ఈ మెఱపు మెఱయదు. అగ్ని యెట్లు వెలుఁగును. ఆ బ్రహ్మ ప్రకాశింపఁగా దానిననుసరించి సర్వము వెలుఁగును. దాని ప్రకాశముచే నిది యంతయుఁ బ్రకాశించుచున్నది.

బ్రహ్మైవేద మమృతం, పురస్తాద్బ్రహ్మ పశ్చాద్బ్రహ్మ దక్షిణత శ్చోత్తరేణ
అధశ్చోర్ధ్వంచ ప్రసృతం బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠం ॥

ఈ యమృతము బ్రహ్మమె, ముందున్నది బ్రహ్మమె, వెనుకను దక్షిణము గాను ఉత్తరముగాను నున్నది బ్రహ్మమె. క్రిందఁబైని వ్యాపించినది బ్రహ్మమె. ఈ శ్రేష్ఠమగు విశ్వమంతయు బ్రహ్మమె

ఇతి

ద్వితీయ ముండకే ద్వితీయః ఖండః

పరము నవరమునగునాత్మ నరసినంత
ఎడఁడఁగలుగు నజ్ఞానంబు ముడులు విడును
సర్వమగు సంశయములు నాశంబుచెందు
కర్మలెల్లను వీనివి క్షయమునొందు.

వివ :- ఫలము = కారణాత్మకమైనది. అవరము = కార్యాత్మకమైనది. ఇందుఁ బరమాత్మదర్శనమునకు ఫలము చెప్పంబడెను.

మెఱయు బంగరుఁబలుమంచియొరను వఱలి
మలినములు లేక యవయవకళలు లేక
శుభ్రమై జ్యోతులకునెల్ల జ్యోతియగుచు
నలరుబ్రహంబు ఁదెలియుదు రాత్మవిదులు.

అచటసూర్యుఁడును వెలుంగఁ డచటఁ జంద్రుఁడు వెలుంగఁడు
అచట నక్షత్రములు వెల్గ, వచట నీ మెఱపు మెఱయ
దచట నీయగ్ని యేపాటి, దదివెల్గ దానిబట్టి
యిచటనెల్ల వెల్గును, సర్వమిది దానికాంతివెలుగు ॥

వివ:- సూర్యచంద్రాదులు ఆబ్రహ్మమును బ్రకాశింపజేయలేవు. అదియె యన్నిటిని ప్రకాశింపఁజేయును. ఆయాత్మ స్వయముగను బ్రకాశించును నిష్కలము నిశ్చలమునగు బుద్ధికిని గ్రాహ్యమగునని భావము.

ఇందు నమృతంబు బ్రహ్మమె, ముందుఁగలది
వెనుకఁగలది బ్రహమె, దక్షిణమునందు
నుత్తరముఁ గ్రిందను బైనినుండి నిండి
తగునదియు బ్రహ్మ; మీశ్రేష్ఠజగము బ్రహ్మ ॥

ఇది

రెండవ ముండకమున రెండవ ఖండము

# అథ

## తృతీయ ముండకే ప్రథమః ఖండః

ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే
తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యో అభిచాకశీతి॥

మంచిఱెక్కలు గలిగినట్టియుఁ గలిసి యున్నట్టియు సఖులైనట్టియు రెండు పక్షులు ఒక చెట్టును ఆశ్రయించియున్నవి. అందులోనొకటి (జీవుఁడు) యిష్టమైన ఫలము ననుభవించుచున్నది. రెండవది (ఈశ్వరుఁడు) అనుభవింపకయె కేవలము చూచుచున్నది.

సమానే వృక్షే పురుషో నిమగ్నోఽనీశయా శోచతి ముహ్యమానః
జుష్టం యదా పశ్యత్యన్య మీశమస్య మహిమాన మితి వీతశోకః॥

జీవుఁడా శరీరమను చెట్టు నొక్కదానియందె నిమగ్నుఁడై మోహము పొంది దీనత్వముతో దుఃఖించును. ఎప్పుడైతే సాధకులచే సేవింబడునట్టి యితరుఁడైన యీశ్వరుని అతనిమహిమను జూచునో యపుడు శోకమును వీడును.

యదా పశ్యః పశ్యతే రుక్మవర్ణం, కర్తార మీశం పురుషం బ్రహ్మయోనిం
తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ, నిరంజనః పరమం సామ్యముపైతి॥

బంగారు రంగుగల, కర్తయైన హిరణ్య గర్భ బ్రహ్మకుఁ గారణమైన యీశ్వరుఁడైన పురుషుని సాధకుఁడెప్పుడు చూచునొ యపుడు విద్వాంసుఁడు పాప పుణ్యములను దగులఁబెట్టి నిర్లిప్తుఁడై గొప్పదైన యద్వైతమును బొందును.

ప్రాణో హ్యేష యఃసర్వభూతైర్విభాతి, విజానన్ విద్వాన్ భవతే నాతివాదీ
ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావా నేష బ్రహ్మవిదాం వరిష్ఠః

సర్వభూతములతోపాటు ప్రకాశించు ప్రాణమితఁడె. దీనిని దెలిసిన విద్వాంసుఁడు బ్రహ్మమును అతీతించి వేఱుగా నింకొక పదార్థమున్నదని

## మూఁడవ ముండకమున మొదటి ఖండము

కిలసి మిత్రులై మంచి ఱెక్కలను గలిగి
పక్షులవిరెండు నొకచెట్టు పట్టియుండు
అందొకటి రుచ్యమగు ఫలమనుభవించు
రెండవది సాక్షిగా మాత్రముండుఁ దినక ॥

వివ:- జీవుఁడు ఈశ్వరుఁడు రెండుపక్షులు, చెట్టు శరీరము, సుఖదుఃఖాదులు ఫలము, జీవుండు కర్మఫలమనుభవించును. ఈశ్వరుఁడు ఫలమునదినక సాక్షిగా నుండునని భావము.

జీవుఁడా చెట్టువదలక చిక్కియుండి
మోహమునుబొంది దీనుఁడై పొగులుచుండు
యోగులరయు నన్యునీశునొంది, మహిమ
యిది యతనిదంచుగనువాఁడు వ్యథలఁగనఁడు ॥

వివ:- ఇట్లు చూచువాఁడు శోకమునుదాటి కృతకృత్యుఁడగునని భావము.

స్వప్రకాశుఁడీశుఁడు కర్త బ్రహ్మయోని
యయిన పురుషుని సాధకుండరయు నెపుడు
అపుడె ప్రాజ్ఞుండు పాపపుణ్యముల వీడి
యంటఁబడక యుత్కృష్ట సామ్యమును బొందు ॥

వివ:- బ్రహ్మయోని=హిరణ్యబ్రహ్మ బ్రహ్మకు మూలకారణము.

ప్రాణులన్నింటఁ గలప్రాణమతఁడు వానిఁ
గనెడు బుధుఁడు బ్రహ్మకు వేఱుగనఁడు దేని
ఆత్మ విహరించి యానంద మాత్మఁబొంది

పలుకఁడు. అతఁడాత్మయందె విహరించుచు ఆత్మయందె యానందము పొందుచు జ్ఞానాదిక్రియలు గలవాఁడై యుండును. ఇతఁడు బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుఁడు.

సత్యేన లభ్యస్తపసా హ్యేష ఆత్మా, సమ్యగ్‌జ్ఞానేన బ్రహ్మచర్యేణ నిత్యం
అంతః శరీరే జ్యోతిర్మయోహి శుభ్రో, యంపశ్యంతి యతయః క్షీణదోషాః.

ఈ యాత్మ సత్యముచేతఁ దపస్సుచేత, మంచిజ్ఞానముచేత నిత్యము బ్రహ్మచర్యముచేతఁ బొందఁదగినది. దోషములుపోయిన యతులు దేనిని జూతురో యా యాత్మ శరీరములోపల జ్యోతిర్మయమై శుభ్రమైయున్నది.

సత్యమేవ జయతే నానృతం, సత్యేన పంథావితతో దేవయానః
యేనాక్రమంత్యృషయో హ్యాప్తకామా యత్రతత్సత్యస్య పరమం నిధానం

సత్యమే జయించును అనృతము జయింపదు. పూర్ణకాములైన ఋషులు ఏ మార్గముగాఁ బోవుదురో, సత్యముయొక్క యా పరమ నిధానమెక్కడ నున్నదో యట్టి దేవయాన మార్గము సత్యముచే విస్తరింపఁబడి యున్నది.

బృహచ్చ తద్దివ్య మచింత్యరూపం, సూక్ష్మాచ్చతత్ సూక్ష్మతరం విభాతి
దూరాత్సుదూరే తదిహాంతికే చ, పశ్యత్స్విహైవ నిహితం గుహాయాం॥

అది గొప్పది దివ్యమైనది యూహింపరాని రూపముగలది సూక్ష్మము కంటె సూక్ష్మముగాఁ బ్రకాశించుచున్నది. దూరముకంటె దూరముగను ఇక్కడనే దగ్గఱగనున్నది. దానినిజూచు వారియందు ఈ హృదయ గృహయందె యున్నది.

నచక్షుషా గృహ్యతే నాపివాచా నాన్యైర్దేవై స్తపసా కర్మణావా
జ్ఞాన ప్రసాదేన విశుద్ధ సత్త్వ స్తతస్తుతం పశ్యతే నిష్కలంధ్యాయమానః॥

కంటిచే నది గ్రహింపఁబడదు వాక్కుచేఁగాని యితరేంద్రియములచేఁ గాని తపసుచేఁగాని కర్మచేఁగాని గ్రహింపఁబడదు. నిర్మలజ్ఞానముచేఁ బరిశుద్ధమైన మనస్సుగలవాఁడై పిదప ధ్యానించుచున్నవాఁడై యవయవహీనుఁడైన పరమాత్మను జూచును.

ఏషో ఽణు రాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ
ప్రాణైశ్చిత్తం సర్వమోతం ప్రజానా యస్మిన్ విశుద్ధే విభవత్యేష ఆత్మా॥

జ్ఞానియగు; బ్రహ్మవిదులలో ఘనుఁడితండు

వివ:- సర్వప్రపంచము ఆత్మస్వరూపమైనదేగాని ఆత్మకంటె వేఱైనదిలేదు కనుక అజ్ఞాని బ్రాహ్మకంటె భిన్నముగ నున్నదని దేనిని బలుకఁడని భావము.

నిత్యమును సాధుబుద్ధిచే సత్యమునను
బ్రహ్మచర్యముచేఁ దపసుచేఁ బడయునాత్మ
క్షీణదోషులు యతులు దర్శించు నాత్మ
స్వచ్ఛమై, జ్యోతియై, హృదబ్జమున వెలుఁగు ॥

వివ:- తపస్సు=ఇంద్రియ మనస్సుల యేకాగ్రత.

సత్యమెజయించు నన్నృతంబు జయముగనదు
పూర్ణకాములు ఋషులెట్టి పొంతఁజనిరొ
సత్య పరమనిధాన మెచ్చటగలదొ
యట్టిదేవయానగతి సత్యమున వఱలు ॥

వివ:- సత్యవంతులు దేవయాన మార్గముద్వారా బ్రహ్మమును బొందుదురని భావము.

గొప్పదది దివ్యమూహించుకొనఁ బడనిది
సూక్ష్మమునకంటె సూక్ష్మమై శోభచెందు
దవ్వునకు దవ్వునగు, నిందెదరిని నుండు
హృదయగుహఁజూచువారిలో నిటనెగలదు ॥

వివ:- అదిదగ్గఱనున్నను అవిద్యచేఁ గప్పఁబడిన జడులకది మిగుల దూరముగ నుండునని భావము.

అక్షిచే వాక్కుచే నింద్రియములచేత
తపసుచేఁ గర్మచేనాత్మ దరియఁబడదు
జ్ఞానము ప్రసాదమున శుద్ధసత్త్వుఁడగుట
నంగశూన్యు ధ్యానించువాఁడాత్మఁగాంచు ॥

వివ:- శుద్ధసత్త్వుఁడు=పరిశుద్ధ మనస్సుగలవాఁడు. అంగశూన్యుఁడు= అద్వైతుఁడుగానె ఎట్టియవయవ విభాగములేనివాఁడు.

ప్రాణమైదుగానయి చొచ్చుస్వాంతగుహను
సూక్ష్మమౌనాత్మ మనసుచేఁ జూడఁదగును
ప్రజలహృదినెల్లఁ బ్రాణముల్ వ్యాప్తమయ్యె
స్వచ్ఛమగుహృదయందె యీయాత్మ మెఱయు ॥

ఈ యాత్మ యణువైనది మనస్సుచేఁ దెలిసికొనఁ దగినది. దానియందె ప్రాణము అయిదు విధములుగాఁ బ్రవేశించెను. ప్రాణములచేతఁ బ్రజల చిత్త మంతయు వ్యాపించియుండెను. ఆ చిత్తము పరిశుద్ధముకాఁగా నీ యాత్మ ప్రకాశించును.

యంయంలోకం మనసా సంవిభాతి విశుద్ధ సత్త్వః కామయతే
యాంశ్చ కామాన్ఁ తతం లోకం జయతే తాంశ్చ కామాం
స్తస్మా దాత్మజ్ఞం హ్యర్చయే ద్భూతికామః ॥

ప్రసన్న మనస్సుగల యాత్మవేత్త మనసుచే నేయేలోకమును సంకల్పించునో యే కోరికలను గోరునో యాయాలోకమును ఆకోరికలను జయించును. కావున నైశ్వర్యమును గోరువాఁడు ఆత్మవేత్తను బూజింపవలయును.

ఇతి

తృతీయ ముండకే ప్రథమః ఖండః



3. ముం. 1. ఖం. ముండకోపనిషత్తు

వివి:- ప్రాణాపాన సమానవ్యానోదానములని ప్రాణములయిదు. కన్ను చెవి ముక్కు మొదలగు నింద్రియములును ప్రాణములె.

ఎడఁదచేత నేయేలోకములఁదలంచి
కోర్కెలెవి శుద్ధచిత్తుండుకోరు, నట్టి
భువనములుఁ గోర్కెలనతఁడు పొందుఁగానఁ
గొలువవలె నాత్మవిదు భూతిగోరువాఁడు ॥

వివ:- భూతి=ఐశ్వర్యము. ఇట్టిజ్ఞాని సర్వాత్మను ఆత్మగాఁబొందినవాఁడు గాన సర్వఫలమును బొందునని భావము.

ఇది

మూఁడవ ముండకమున మొదటిభాగము.

## అథ

## తృతీయ ముండకే ద్వితీయః ఖండః

సవేదైతత్ పరమం బ్రహ్మధామ, యత్రవిశ్వం నిహితం భాతి శుభ్రం
ఉపాసతే పురుషం యేహ్యకామా, స్తే శుక్రమేత దతివర్తంతి ధీరాః

ఏ బ్రహ్మమందు ఈ విశ్వము ఉంచఁబడినదై తనతేజస్సుచే శుద్ధముగాఁ ప్రకాశించుచున్నదో యట్టి యుత్తమమైన బ్రహ్మధామమును ఆత్మవేత్తయే తెలిసికొనును. ఎవరు నిష్కాములై పురుషునుపాసింతురో యట్టిధీరులు సంసార బీజమగు శుక్రమును దాటుదురు.

కామాన్యః కామయతే మన్యమానః సకామభిర్జాయతే తత్ర తత్ర
పర్యాప్తకామస్య కృతాత్మన స్త్విహైవ సర్వే ప్రవిలీయంతి కామాః

ఎవఁడు రూపాదులను దలఁచుకొనుచుఁ గామములను గోరునో వాఁడు కోరికలచే ఆకోరికలను బొందఁదగిన యాయా చోటులందుఁ బుట్టును. కోరికలు దీఱి యాత్మరూపముఁబొందినవానికిందే సర్వకామములు అణఁగును.

నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన
యమే వైషవృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూంస్వాం॥

ఈ యాత్మ వేదములను గ్రహించుటచేతఁ గాని ధారణా శక్తిచేతఁ గాని ఎక్కువశాస్త్రములు చదువుటచేతఁ గాని లభింపదు, ఏ యాత్మను సాధకుఁడు గోరునో యట్టియాత్మ ఆయాత్మను గోరుసాధకునికి లభ్యమగును. అట్టి యాత్మను గోరు సాధకునికి ఆయాత్మయె తన స్వరూపమును వివరించును.

నాఽయ మాత్మా బలహీనేన లభ్యో, నచప్రమాదాత్త పసోవాఽప్యలింగాత్

## మూడవ ముండకమున రెండవఖండము

విశ్వమటనిల్చి శుద్ధమై వెలుఁగు, నట్టి
విశ్రుతబ్రహ్మ పదమాత్మవిదుఁడె యెఱిఁగి;
తృప్తులై పూరుషునిగొల్చు ధీరవరులె
పుట్టుకకు బీజమగు శుక్రమును జయింత్రు ॥

వివ:- సంతానోత్పత్తి కారణమగు శుక్రమును అనఁగా జన్మను జయించి జరామరణరహితులై ముక్తులగుదురని భావము.

కోర్కెఁగలవాఁడు తానెట్టి కోర్కెఁగోరు
నట్టికోర్కెకై యందందుఁ బుట్టుచుండు,
పూర్ణకాములై యాత్మరూపునఁ జెలంగు.
వారికిందె యణంగులెల్ల కోరికలును ॥

వివ:- సుఖదుఃఖాది ద్వంద్వములకుఁ గారణము కామముగాన నిష్కామునకవి పోవునుగాన ముక్తి యగునని భావము.

వేదముల పఠించుటవల్ల మేధవల్ల
అధికశాస్త్ర పాఠమువల్ల నట్టియాత్మ
పొందరానిది, యెవఁడాత్మ పొందఁగోరు.
వానికాత్మయె తనమేను ప్రకటపఱచు ॥

వివ:- లోకములో గృహాదులను నిర్మించువారు ఇతరములను అప్రధానముగఁ దలఁచి తమసర్వశక్తులు గృహాదినిర్మాణములో నుపయోగించి యట్టి గృహాదులను బొందునట్లు ఆత్మనుగోరువాడు పశుపుత్రధనాదులకుఁ ప్రాధాన్యము చూపక యాత్మదర్శనమునకే ప్రాధాన్యము చూపినచో ఆత్మదర్శనము బొందునని భావము.

నిరతము ప్రమాదపడువాఁడు నిఁకవిరక్తి-
హీనుడు నశక్తుఁడీయాత్మఁ గానలేరు

ఏతైరుపా యైర్యతతేయస్తు విద్వాంస్త స్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ॥

ఈ యాత్మను బలహీనుఁడు పొందలేఁడు, లౌకిక పశుపుత్రాది విషయ సంగనిమిత్తమైన ప్రమాదమువల్లను విరక్తిలేని తపస్సువల్లను ఈ యాత్మ దొరకదు. బలము అప్రమాదము విరక్తిమొదలగునుపాయములచేఁ బ్రయత్నించు విద్వాంసుని యాత్మయె బ్రహ్మపదమును బ్రవేశించును.

సంప్రాప్యైన మృషయో జ్ఞాన తృప్తాః కృతాత్మానో వీతరాగాః ప్రశాంతాః
తే సర్వగం సర్వతః ప్రాప్యధీరా యుక్తాత్మానః సర్వమేవాఽఽవిశంతి॥

ఈ యాత్మను బొంది ఋషులు జ్ఞానముచే తృప్తులై పరమాత్మ స్వరూప మును బొందినవారై వీతరాగులై నిర్మలాత్ములై ధీరులై స్థిరాత్ములై విశ్వమును బొందిన యాత్మను అంతటఁబొంది చివర విశ్వముఁనే ప్రవేశింతురు.

వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః, సంన్యాసయోగాద్యతయః శుద్ధసత్త్వాః
తే బ్రహ్మలోకేషు పరాంతకాలే, పరామృతాః పరిముచ్యంతి సర్వే ॥

వేదాంత విజ్ఞానమునకుఁ బ్రయోజనమైన పరమాత్మనుగూర్చి నిశ్చ యముగాఁ దెలిసికొన్నట్టియు సంన్యాసయోగమువల్ల శుద్ధమైన స్వభావము గల్గి నట్టియు నగు నాయతులందఱు జీవించియుండఁగనె బ్రహ్మస్వరూపులై దేహ త్యాగ కాలమందు బ్రహ్మలోకములందు ముక్తులై యుందురు.

గతాః కలాః పంచదశ ప్రతిష్ఠా, దేవాశ్చ సర్వే ప్రతిదేవతాసు
కర్మాణి విజ్ఞాన మయశ్చ ఆత్మా పరేఽవ్యయే సర్వ ఏకీభవంతి ॥

ప్రాణాదులైన పదునైదు కళలు తమ మూలకారణములను బొందును. సర్వేంద్రియములు తమ యధిదేవతలైన సూర్యాదులందుఁ జేరును. కర్మలు విజ్ఞానమయమైన జీవాత్మయును అన్నియు అవ్యయమైన పరబ్రహ్మమందేకీభ వించును. (కన్నులు సూర్యునియందు, చెవులు దిక్కులను, ముక్కులు అశ్వినీ దేవతలను వాక్కు అగ్నిని, త్వక్కు వాయువును జేరును).

యథానద్యః స్యందమానాః సముద్రేఽస్తంగచ్ఛంతి నామరూపే విహాయ
తథా విద్వాన్నామరూపాద్విముక్తః, పరాత్పరం పురుష ముపైతిదివ్యం

నదులు ప్రవహించుచు సముద్రమందెట్లు నామరూపములను విడిచి గలిసిపోవుచున్నవో యట్లే విద్వాంసుఁడు నామరూపములను విడిచి పరాత్పరుఁ డైన పురుషుని గలియును.

సయోహవై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి

అప్రమాదా ద్యుపాయంబు లలరుబుధుని
యాత్మయే ప్రవేశించు బ్రహ్మలయంబు ॥

వివ:- అప్రమాదాద్యుపాయములు= ప్రమాదపడకుండుట, విరక్తి, శక్తి మొదలగు నుపాయములు.

దీనిఁబొంది ఋషులు జ్ఞానతృప్తులగుచు
స్వస్థులై వీతరాగులై శాంతులగుచు
విహిత ధృతులై స్థిరాత్ములై విశ్వమొందు
నాత్మనంతట గని విశ్వమై చరింత్రు ॥

వివ:- కుండపగిలిపోఁగా కుండలోని యాకాశము సమస్తాకాశమున గలిసి పోయినట్లు విశ్వమునఁ గలిసిపోదురని భావము.

పూర్ణవేదాంత విజ్ఞానమున లభించు
నాత్మయెడ నిశ్చితులయి సంన్యాసయుక్తి
యతులు శుద్ధసత్త్వులయి బ్రహ్మస్వరూపు
లగుచు ముక్తులయ్యెదరు దేహాంతవేళ॥

అపుడు పదునేన్కళలు స్వాశ్రయములఁ జెందు
స్వాధి దేవతలను నింద్రియములు చేరు
అంత విజ్ఞానరూప జీవాత్మ దాని
కర్మలును బరబ్రహ్మనైక్యంబు చెందు॥

వివ:- జలము మొదలైన యాధారములు తీసివేయఁగా సూర్యాది ప్రతిబింబములు సూర్యునందు ఏకీభవించునట్లు పరబ్రహ్మలో జీవాత్మ ఏకత్వము చెందునని భావము.

నదులు ప్రవహించుచు స్వరూపనామములను
విడిచియెటు సముద్రంబులోఁ గలిసిపోవు
అటులె బుధుఁడు స్వనామరూపాది విడిచి
పూర్ణదివ్యఁబరాత్పరుఁ బురుషుఁగలియు॥

బ్రహ్మము నెఱుంగువాఁడు బ్రహ్మంబెయెగును
వానికులముఁబుట్టఁ డబ్రహ్మవేత్త

నాఽస్యాఽబ్రహ్మవిత్కులే భవతి, తరతిశోకం తరతి
పాప్మానం గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి॥

ఎవఁడా పరబ్రహ్మను దెలిసికొనునో వాఁడు బ్రహ్మమె యగును. ఇతని కులమందు బ్రహ్మవేత్తకానివాఁడు పుట్టఁడు. వాఁడు శోకమును దాటును పాపమును దాటును. హృదయ గృహయందలి ముడులనుండి విముక్తుఁడై యమృతుఁడగును.

తదే తదృచాఽభ్యుక్తం క్రియావంతః శ్రోత్రియాబ్రహ్మనిష్ఠాః
స్వయం జుహ్వత ఏకర్షిం శ్రద్ధయంతః తేషామేవైతాం
బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివ ద్యైస్తుచీర్ణం॥

ఎవరు పూర్వమందుఁ జెప్పఁబడిన క్రియల నాచరింతురో ఎవరు వేదజ్ఞులో బ్రహ్మనిష్ఠులో ఎవరు శ్రద్ధగలవారై ఏకర్షియను పేరుగల యగ్నిని స్వయముగా హోమముచేయుదురో ఎవరు యథావిధిగా అగ్నిని శిరస్సునఁ దాల్చువ్రతమును జేయుదురో వారికే యీ బ్రహ్మవిద్యను జెప్పవలయును. ఇది ఋక్కుచేఁ జెప్పఁబడినది.

తదేతత్ సత్యమృషి రంగిరాః పురోవాచ, నైతదచీర్ణ
వ్రతోఽధీతే, నమః పరమ ఋషిభ్యోనమః పరమ ఋషిభ్యః

ఈ సత్యస్వరూపుఁడైన పురుషునిగూర్చి యంగిరుఁడను ఋషి శౌనకునకుఁజెప్పెను. దీనిని వ్రతము చేయనివాఁడు చదువఁడు. బ్రహ్మ మొదలుగా ఈవిద్యచెప్పిన పరమ ఋషులకు నమస్కారము పరమఋషులకు నమసారము.

శాంతి మంత్రః
(చూ. ఉపనిషత్తు మొదట)

ఇతి

ద్వితీయ ముండకే ద్వితీయః ఖండః
ముండకోపనిషత్ సమాప్తా



వాఁడుశోకముదాటుఁ బాపమును దాటు
స్వాంత బంధంబులన్ దెంచియమృతుఁడగును॥

వివ:- బ్రహ్మవేత్త బ్రహ్మయగునని చెప్పుటచే సర్వజగములు బ్రహ్మమెగాన బ్రహ్మముకంటె వేఱువస్తువులు లేనవుడి కఁదనకు దేనివల్ల నుభయము గలుగదని భావము.

ఆచరణగల్గి, శ్రోత్రియులయి బ్రహ్మనిష్ఠులగుచు
ఏకఋషి నామకాగ్నిని నెదశ్రద్ధఁ దామెదాల్చి
శాస్త్రగతి నగ్నిఁదలఁదాల్పఁ జనుశిరోవ్రతమొనర్చు
వారికే బ్రహ్మవిద్య చెప్పవలె వేదోక్తమిద్ది॥

వివ:- అనర్హులయిన వారికిఁ జెప్పినను ఉపయోగము లేదుగాన అర్హులయిన వారికే యీవిద్య చెప్పవలయునని భావము.

సత్యమక్షరమగు, దీని శౌనకునకు
అంగిరుఁడు చెప్పెమును; వ్రతమాచరింప
నతఁడుదీనిఁ జదువఁడు, మహర్షులకిదె
వందనము మహర్షులకిదె వందనంబు॥

వివ:- బ్రహ్మమొదలుకొని వరుసగా ఈవిద్యను బోధించిన మహర్షులకు నమస్కారము అని భావము.

శాంతి మంత్రము
(చూ. ఉపనిషత్తు మొదట

ఇది

శ్రీ చర్ల నారాయణ శాస్త్రి జనకగురు కరుణాలబ్ధ విద్యుఁడును వెంకమాంబా పుత్రుఁడునగు గణపతిశాస్త్రిచేఁ దెనిఁగింపఁబడిన మూఁడవముండకమున రెండవఖండము.

ముండకోపనిషత్తు సమాప్తము

# ఉపనిషత్సుధా

## మాండూక్యోపనిషత్

### (అథర్వవేదాతర్గతా)

### శాంతిమంత్రః

ఓమ్

భద్రం కర్ణేభిః శ్రుణుయామ దేవాః, భద్రం పశ్యేమాక్షభి
ర్యజత్రాః స్థిరై రంగై స్తుష్టువాంసస నూభిః వ్యశేమదేవహితం యదాయుః॥

దేవతలనుగుచు మేము చెవులచే శుభము విందుముగాక, యజ్ఞశీలురమైన మేము కన్నులచే శుభమును జూతుముగాక, స్థిరమైన యంగంబులతో శరీరము లనెడి మంత్రములతో మిమ్ము స్తుతించుచు దేవులు ప్రసాదించిన దీర్ఘాయువును బొందుదుముగాక.

స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్దధాతు॥

బృహస్పతి మొదలగు పెద్దలయొద్ద వినెడి యింద్రుఁడు మాకు శుభములు గలుగఁ జేయుఁగాక, సర్వమును దెలిసిన సూర్యుఁడు మాకు శుభమిచ్చుఁగాక, అహింసాపాలకుఁడైన గరుత్మంతుఁడు మాకు శుభమిచ్చుఁగాక, బృహస్పతి మాకు శుభమిచ్చుగాక.

ఓమ్

శాంతిః శాంతిః శాంతిః

ఉపనిషత్సుధ

మాండూక్యోపనిషత్తు

(అథర్వ వేదములోనిది)

శాంతిమంత్రము. దండకము

ఓమ్

చెవులచే భద్రముల్ విందు మాదైవభావంబుఁ బొందుచున్
గండ్లతో భద్రముల్ చూతు మాయజ్ఞశీలంబుతో
నిశ్చలంబైన యంగంబులన్ దేహమంత్రాలతో
స్తోత్రముల్ చేతు మెల్లప్డు
దేవుల్ ప్రసాదించు దీర్ఘాయువుల్
గల్గుతన్ మాకిలన్॥

మాకున్ శుభంబిచ్చుతన్ బెద్దలన్ భక్తి నాలించు
నింద్రుండు మాకున్ శుభంబిచ్చుతన్ సర్వవేదుండు
సూర్యుండు, మాకున్ అహింసాపథుండౌ గరుత్మంతుఁ
డిచ్చున్ శుభంబుల్ సురాచార్యుఁ
డిచ్చున్ శుభంబుల్ సదా.

ఓమ్

శ్శాంతి శాంతి శ్శాంతిః



ఓమిత్యే తదక్షర, మిదం సర్వం తస్యోపవ్యాఖ్యానం, భూతంభవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ, యచ్చాన్యత్త్రి కాలాతీతం తదప్యోంకార ఏవ॥

ఓం అనునది యక్షరబ్రహ్మము. ఇదియంతయు దానికి వ్యాఖ్యానము, భూత వర్తమాన భవిష్యత్కాలములు అంతయు ఓంకారమె, త్రికాలములకు అతీంచియున్నది కూడ ఓంకారమె.

సర్వం హ్యేతద్బ్రహ్మ అయమాత్మా బ్రహ్మ
సోఽయమాత్మా చతుష్పాత్॥

ఇదియంతయు బృహత్స్వరూపమైన బ్రహ్మమె, ఇదియంతయు సర్వత్ర వ్యాపించిన యాత్మయె, ఈ యాత్మనాలుగు పాదములుగలది.

జాగరితస్థానో. బహిః ప్రజ్ఞః, సప్తాంగ, ఏకోనవింశతి
ముఖః, స్థూలభుగ్, వైశ్వానరః ప్రథమః పాదః

జాగ్రదవస్థయె (మెల్కువయె) స్థానముగాఁ గలిగినట్టియు, బాహ్య ప్రపంచవిషయకమైన ప్రజ్ఞ కలిగినట్టియు, (1) ద్యులోకమనెడి శిరసు, (2) సూర్యుఁడనెడికన్ను (3) వాయువనెడి ప్రాణము (4) ఆకాశమనెడి మధ్య భాగము (5) నీరనెడిమూత్రము (6) భూమియనెడికాళ్లు (7) ఆహవనీయాగ్ని యనెడి ముఖము అనునేడు అంగములు గలిగినట్టియు, చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు, వాక్కు, చేతులు, కాళ్లు, మలద్వారము, మర్మేంద్రియము, ప్రాణము, అపానము, వ్యానము ఉదానము, సమానము, మనసు, బుద్ధి, చిత్తము అహంకారము, అను నీ పంధొమ్మిది ముఖములుగల, స్థూలమగు శబ్దాది విషయముల ననుభవించునట్టి వైశ్వానరుఁడు మొదటిపాదము.

స్వప్నస్థానోఽన్తః ప్రజ్ఞః సప్తాంగ ఏకోనవింశతిముఖః
ప్రవివిక్తభుక్ తైజసో ద్వితీయః పాదః ॥

స్వప్నమె స్థానముగాఁ గలిగినట్టియు బహిరింద్రియాపేక్ష లేకుండఁ గేవల మానసికమగు ప్రజ్ఞకలిగినట్టియు, ఏడు అవయములు గలిగి పంధొమ్మిది ముఖములు గలిగినట్టియు లోని సూక్ష్మవిషయములను అనుభవించు తైజసుఁడు రెండవపాదము.

ఓ మనునదక్షర బ్రహ్మ, ఓమనియెడి
దాని కీవిశ్వమెల్ల వ్యాఖ్యాన మగును
భూతవర్తమాన భవిష్యములును ఓమె
ఇతరమగు త్రికాలా తీత మెల్లఓ మె॥

వివ:- మండూక మహర్షిచే నీయుపనిషత్తు దర్శింపఁబడినదిగాన మాండూక్యోపనిషత్తు అని పేరుగలిగినది.

ఈయవి యంతయు బ్రహ్మమె
ఈయాత్మయుఁగూడ బ్రహ్మమే యయివలబున్
ఈయాత్మ రూపబ్రహ్మకు
నేయెడఁ బాదములు నాలుగెసంగుచు నుండున్॥

జాగ్రతయె స్థానమై బాహ్యజగతిఁ బ్రజ్ఞ
కలిగి, యవయవములు నేడుకలిగి, పదియుఁ
దొమ్మిది ముఖంబులలలారు స్థూలవిషయ
భోక్త వైశ్వానరుఁడు దానిమొదటి పదము॥

వివ:- బ్రహ్మమును బొందించునవిగాన పాదములు అనివ్యుత్పత్తి. బ్రహ్మము మెల్కొ-పయందు ఆయాయవయవములను ధరించి విషయము అనుభవించుట ఇందు వర్ణించి చెప్పఁబడెను. ద్యులోకాదులు ఏడును శీర్షాదులుగను జ్ఞానకర్మేంద్రియ మనోబుద్ధి చిత్తాహంకారములు పందొమ్మిది ముఖంబులుగ ఇందు ఆరోపింప బడెను. విశ్వనరులను వివిధముగ నడుపువాఁడు అనిగాని విశ్వస్వరూపము గల నరుఁడు అనిగాని వైశ్వానరపదమునకు వ్యుత్పత్తి.

స్వాప్నిక స్థాన మాంతర ప్రజ్ఞకలిగి
యవయవములేడు పందొమ్మిదగు ముఖంబు
లలరిసూక్ష్మ వాసనలను ననుభవించు
తైజసుఁడిల ద్వితీయ పాదముగ వఱలు॥

వివ:- స్వప్నములోని సూక్ష్మ విషయముల ననుభవించునీశ్వరుని తేజస్స్వరూపము తైజసుఁడను పేరుతో రెండవపాదముగఁ గల్పింపఁ బడెనని తెలియునది.

యత్రసుప్తో నకంచన కామంకామయతే నకంచన స్వప్నం
పశ్యతి తత్సుషుప్తం। సషుప్తస్థాన ఏకీభూతః ప్రజ్ఞాన ఘన
ఏవాఽఽనందమ యోహ్యానదభుక్ చేతో ముఖఃప్రాజ్ఞస్తృతీయః పాదః॥

ఏ యవస్థలో నిద్రించినవాఁడై ఏకోంకను గోరఁడో ఏస్వప్నమును జూడఁడో అది సుషుప్తావస్థయనఁబడును. అట్టి సుషుప్తావస్థ కలిగినవాఁడై జాగ్రత్స్వప్నావస్థలందు అనుభవించిన సర్వప్రపంచమును ఏకరూపముగ బొందినవాఁడై వివిధ విషయ విజ్ఞానములు ఘనీభావము పొందినవాఁడై మనస్సే ద్వారముగల ప్రాజ్ఞుఁడు మూఁడవపాదము.

ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోఽంతర్యా మ్యేష
యోని స్సర్వస్య ప్రభవాప్యయౌ హి భూతానాం॥

తనస్వరూపమగు చైతన్యమందున్న యితఁడు అన్నింటికిఁ బ్రభువు. ఇతఁడు అన్నిదెలిసినవాఁడు, ఇతఁడు అన్నిటిలోపల నున్నవాఁడు, ఇతఁడన్నిటికి మూలకారణము ఇతఁడు సమస్తప్రాణులకు ఉత్పత్తి ప్రళయములైన వాఁడు.

నాంతః ప్రజ్ఞంన బహిష్ప్రజ్ఞంనో భయతః ప్రజ్ఞంన ప్రజ్ఞానఘనం
న ప్రజ్ఞంనాఽప్రజ్ఞం। అదృష్ట మవ్యవహార్య మగ్రాహ్యమలక్షణ
మచింత్య మవ్యపదేశ్యమే కాత్మ్యప్రత్యయసారం ప్రపంచోపశమం
శాంతం శివ మద్వైతం చతుర్థం మన్యంతే స ఆత్మాస విజ్ఞేయః॥

ఆంతర ప్రజ్ఞకలది గానిదియు బాహ్యవిషయక ప్రజ్ఞకలది గానిదియు జాగత్స్వప్నములమధ్య యవస్థగలదిగానిదియు, ప్రజ్ఞానముచే ఘనీభావము చెందినది గానిదియు, విభిన్న సమస్త జ్ఞానములు గలది గానిదియు, అచేతనముగానిది, కంటిచేఁజూడరానిదియు, వ్యవహారమున కతీతించినదియు ఇంద్రియములచే గ్రంపరానిదియు, ఇట్టిదని లక్షణము చెప్పరానిదియు, ఊహింపరానిదియు జాగ్రదాద్యవస్థలందు ఈ యాత్మయొకటే యున్నదను ప్రత్యయమే తురీయమును దెలిసికొనుటలోఁ బ్రమాణముగాఁ గలదియు, జాగ్రదాది ప్రపంచము లేనిదియు. శాంతమైనదియు, శుభమైనదియు, అద్వైతమైనదియునగు దానిని నాల్గవపాదమునుగా దలఁచుచున్నారు, అదేయాత్మ. అదే విశేషముగాఁ దెలిసికొనఁదగినది.

ఎందునిదురించి యెదిగోరకెట్టి స్వప్నంబుగనని
యాస్థితి సుషుప్త; మందైక్య మంది ప్రజ్ఞానములును
అటమనీ భావమెగన, నానందమయ మయిమోద
మనుభవింప చిత్తముఖమౌ ప్రాజ్ఞుఁడు మూఁడవదగు

కోకలు స్వప్నములు లేకజ్ఞానములు ఘనీభావరూపమొంది యానంద మయమై యింకనే యవయవములులేక కేవల చిత్తద్వారమున నిద్రలో ఆనంద మఁగనుంటినని తృప్తి ననుభవించు నీశ్వరుని రూపము ప్రాజ్ఞుఁడు అనుపేరుతో విశేష ప్రజ్ఞగలవాఁడని వ్యుత్పత్తి నిబట్టి మూడవపాదముగాఁ గల్పింపఁబడెను.

ఈతఁడే సర్వేశుఁడు
నీతఁడె యంతర్నియంత నిఖిలజ్ఞుండున్
ఈతండె సర్వయోనియు
నీతఁడె ప్రాణులకు జన్మమృత్యులు గూర్చున్॥

వివ:- సర్వహృదయ నియంతయైన యా నందరూపమె ఈశ్వరుఁడని భావము.

అంతః ప్రజ్ఞమును బాహ్యప్రజ్ఞమును గాక
స్వప్నజాగ్రన్మధ్య పదముగాక
ప్రజ్ఞాన ఘనమును ప్రజ్ఞము నప్రజ్ఞ
మనుగాక, కంటిచేఁ గనఁగరాక
వ్యవహరింపఁగరాక పట్టి గ్రహింపఁగరాక
యిట్టిదియని నిర్వచింపరాక
భావవీధిని నెట్లు భావింపఁగారాక
యెవ్విధిని వ్యపదేశింపరాక
సర్వమై కాత్మ్యమౌ జ్ఞాన సారమగుచు
తగఁ బ్రపంచోపశమము నద్వైత మగుచు
శాంతము శివమౌ నాల్గవ చరణ మంత్రదు
ఆత్మయదె, బాగుగ నెఱుంగ నగునదదియె॥

వివ:- ఇందు సర్వస్థితులను అతీతించిన నామరూపాదులులేని పరమేశ్వరుని సమష్టిరూపమైన పరమార్థ స్వరూపము నిరూపింపఁబడెను.

సో౽యమాత్మా౽ధ్యక్షర మోంకారో౽ధి మాత్రం
పాదామాత్రా మాత్రాశ్చపాదా అకార ఉకారో మకార ఇతి॥

ఆయాయాత్మ "ఓమ్" అను నక్షరమునుబట్టి వర్ణింపఁబడుచున్నది. ఆ యోకారము మాత్రలనుబట్టి వర్ణింపఁబడుచున్నది ఇదివఱకోఁ జెప్పిన పాదములే మాత్రలు. అ ఉ మ్ అను మాత్రలే పాదములు.

జాగరితస్థానో వైశ్వానరో౽కారః ప్రథమా మాత్రా
ఆప్తేరాది మత్త్వాద్వా౽౽ప్నోతి హవై సర్వాన్‌కామా నాదిశ్చ
భవతి య ఏవం వేద ॥

జాగ్రదవస్థయే స్థానముగాఁ గల వైశ్వానరుఁడె ఓంకారములోని మొదటి మాత్రయైన అకారము. అది అన్నిటియందు వ్యాపించి యుండుటవల్లఁ గాని అక్షరములలో మొదటి దగుటవలనఁగాని వైశ్వానరుని వంటిది. ఎవఁడిట్లు తెలిసికొనునో వాఁడు సర్వకాలములను బొందును. గొప్పవారిలో మొదటి వాఁడును నగును. ఆప్నోతీతి అఅనివుత్పత్తి.

స్వప్నస్థానస్తై జస ఉకారో ద్వితీయామాత్రా
ఉత్కర్షత్వా దు భత్వాద్వోత్కర్షతి హవైజ్ఞానసంతతిం
సమానశ్చ భవతి నాస్యా౽బ్రహ్మవిత్కులే భవతియ ఏవం వేద॥

స్వప్నమె స్థానముగాఁ గల తైజసుఁడె "ఓం" లోని రెండవమాత్ర యైన ఉపకారము అది అన్నింటికిఁబైని ఉండుటవల్లగాని అ మ్ లకు మధ్యగ నుండుటవల్లను గాని, వైశ్వానర ప్రాజ్ఞులకు మధ్యగానున్న తైజసుని వంటిది. దీనినిఁ దెలిసినవాఁడు విజ్ఞాన సంతతిని వర్ధిల్లఁ జేయును. శత్రుమిత్రులందు సమానుఁడగును. ఇతనికులమాన బ్రహ్మవేత్తగానివాఁడు పుట్టఁడు. ఉత్కర్ష తీతి ఉ అని వ్యుత్పత్తి.

సుషుప్తస్థానః ప్రాజ్ఞోమ కార స్తృతీయా మాత్రా మితే రపీతేర్వా
మినోతిహ వా ఇదం సర్వమపీతిశ్చ భవతి య ఏవం వేద॥

సుషుస్త్యవస్థ స్థానముగాఁ గల ప్రాజ్ఞుండే ఓంలోని మూఁడవమాత్రయైన మకారము. అది అకార ఉకారములను గొలత కొలుచుటవల్లనుగాను అకార ఉకారనాదములను తనలో లయింపఁ జేయుటవల్లగాని ప్రాజ్ఞునివంటిదగును. దానిని దెలిసినవాఁడు దానినంతను కొలుచును తెలిసినవాడు జగత్కారణాత్మ యు నగును.

అట్టి యాత్మ ఓమనియెడి యక్షరమున
వర్ణ్యమగు; నదిమాత్రలంబరగు, మాత్ర
లాత్మపాదంబులె, అకారమును ఉకార
మును మకార మన్నవె పాదములగ నొప్పు॥

వివ:- ఇదివఱలో ఆత్మకుంజెప్పంబడిన పాదములే ఓములోని మాత్రలుగం బడెను.

అల్ల ఓమ్‌లోని తొలిమాత్రయగు అకారము సమస్త
వాక్కులన్ వ్యాప్తమైయుంట, వర్ణాలకాదియగుట
జాగ్రతయె స్థానమైన వైశ్వానరుండగును; నిట్లు
గనెడువాఁడు కోర్కెల నెల్లఁగని యగ్రగణ్యుఁడగును॥

ఓమ్‌లో అఉమ్ అను మూఁడు మాత్రలు జాగ్రత్స్వప్న సుషుప్తులుమూఁడిటిగను ఆరోపింపఁబడుచున్నవి. అకారము పుట్టుకకు స్థానమైన కంఠము అన్ని వాక్కులకు ఆధారముగాన కంఠమునఁ బుట్టిన అఅన్నివాక్కుల వ్యాపించినదని తెలియవలెను. 'అకారోవై సర్వావాక్' అన్ని వాక్కులు అకారమె అనిశ్రుతి అ అవస్థలలోవలె మాత్రలలో ఆ మొదటిది.

ఓములోని రెండవమాత్ర ఉ ఇది యుత్తమమువోలె
నుంట మూఁడుమాత్రల మధ్యనుంట స్వప్నంపుఁదైజ
సమగు. దీనినెఱుఁగువాఁడు జ్ఞానప్రదుఁడగు; నెల్ల
యెడ సముఁడగుఁ, బుట్టఁడితనియింట నబ్రహ్మ వేత్త॥

అఉమ్ లలో అకారముకంటె ఉత్తమముగా నున్నదియు ఆ అఉమ్ లలో మధ్యనున్నది ఉ. తైజసుఁడు వైశ్వానర ప్రాజ్ఞులలో వైశ్వానరుని కంటెఁ బైనున్నవాఁడు మధ్యవాఁడును. కాన ఉకారమునకు తైజసునితో సామ్యము.

ఓమ్‌లోని మూఁడవ మాత్రయౌమకారంబు విశ్వ
తైజస లకొలఁతవల్లఁదనలో అకారమును ఉ
కారములయింపఁ జేయుటన్‌గాని ప్రాజ్ఞుంబె యగును
దానిఁగను మర్త్యుఁడిది యెల్లఁదెలిసిలోకైక్యమొందు॥

అఉలతో మొదలుపెట్టఁబడి మ్‌తో ఓమ్ ముగియుచున్నది. కాన అది అఉలను గొలుచుచున్నది. జాగ్రదవస్థ స్వప్నావస్థలుని ద్రావస్థలో లీనమగుచున్నట్లు అఉలు ధ్వనులు మ్‌లోనేకమగుచున్నవిగాన ప్రాజ్ఞునితో పోలిక అభిభాపము.

అమాత్రశ్చతుర్థోఽవ్యవహార్యః ప్రపంచో పశమః శివోఽద్వైతః
ఏవ మోంకార ఆత్మైవ సంవిశత్యాత్మనాఽఽత్మానం య ఏవం వేద ॥

ఇంక నాల్గవదియైన ఓంకారము మాత్రలులేనిది నామరూపాది రూప వాఙ్మనస్సులుక్షీణించుచుటచే ఇట్టిదని వ్యవహరింపరానిది, బాహ్యప్రపంచ భేదము శాంతిపొందినది, శుభమైనది యద్వైతమైనది. ఇది యాత్మయే. దానినిదెలిసిన వాఁడు ఆత్మతో ఆత్మను ప్రవేశించును.

శాంతి మంత్రః
(చూ. ఉపనిషత్తు మొదట)
ఇతి
మాండుక్యోపనిషత్ సమాప్తా

నాల్గవది యెట్టి మాత్రల నరయరాక
వ్యవహరింపఁగరాక ప్రపంచ శాంత
మైశివమయి యద్వైతమే యయినటమె
ఆత్మ; తద్విదుఁడాత్మతో నాత్మఁజొచ్చు॥

భ్రాంతిపోయి యిదిపాముకాదు త్రాడుఅని తెలిసినవాఁడు దుఃఖమును వలె ఇది ప్రపంచముగాదు ఆత్మయే అని తెలిసినవాఁడు జరామరణములను దాటి ఆనందబ్రహ్మను బ్రవేశించును.

శాంతిమంత్రము
(చూ. మొదట)
ఇది

శ్రీ చర్ల నారాయణ శాస్త్రి జనకగురు ప్రాప్త విద్యుఁడును వెకమాంబాపుత్రుఁడునగు గణపతి శాస్త్రిచే ననువదింపబడిన
మాండూక్యోపనిషత్తు
సమాప్తము.



## ఉపనిషత్సుధా

## తైత్తిరీయోపనిషత్

### (కృష్ణ యజుర్వేదాంతర్గతా)

### శిక్షావల్లీ. ప్రథమోనువాకః

### శాంతి మంత్రః

ఓం శం నో మిత్రః, శం వరుణః, శంనో భవత్వర్యమా
శం న ఇంద్రో బృహస్పతిః, శంనో విష్ణు రురుక్రమః॥

సూర్యుఁడు మాకు శుభమిచ్చుగాక వరుణుడు శుభమిచ్చుఁగాక మాకు అర్యముఁడు శుభమిచ్చుఁగాక, ఇంద్రుఁడు బృహస్పతి మాకు శుభమిత్తురుగాక. విశాలమైన పదములుగల విష్ణువు మాకు శుభమిచ్చుగాక.

నమోబ్రహ్మణే, నమస్తేవాయో, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మవదిష్యామి, ఋతం వదిష్యామి
సత్యంవదిష్యామి, తన్మామవతు,
తద్వక్తారమవతు, అవతుమాం అవతువక్తారం

బ్రహ్మమునకు నమస్కారము. వాయువా నీకునమస్కారము. నీవే ప్రత్యక్షమైన బ్రహ్మవు, నిన్నే ప్రత్యక్ష బ్రహ్మముగాఁ జెప్పెదను శాస్త్రవిహిత మైన దానిని పలికెదను, త్రికరణశుద్ధమైన సత్యమును పలికెదను అది నన్ను రక్షించుఁగాక, చెప్పువానిని రక్షించుగాక నన్ను రక్షించుఁగాక చెప్పువానిని రక్షించుఁగాక.

ఓం శాంతిః శాంతి శ్శాంతిః

## ఉపనిషత్సుధ

## తైత్తిరీ యోపనిషత్తు

(కృష్ణయజుర్వేదములోనిది)

### శిక్షావల్లి మొదటి యనువాకము.

### శాంతి మంత్రము విజయభద్రవృత్తము

శుభమిడుత రవిమాకు శుభమిడుత వరుణుండు
శుభమిడుత అర్యముఁడు శుభమిడుత ఇంద్రుండు
శుభమిడుత బృహస్పతి శుభమిడుత మాకెపుడు
విభువై విశాలముగ విహరించు విష్ణువును॥

సూర్యుఁడు ప్రాణవృత్తికిని పగటికిన్ని, వరుణుఁడు అపానవృత్తికి రాత్రికిని అర్యముఁడు కంటికి, ఇంద్రుఁడు బలమునకు, బృహస్పతివాక్కునకు బుద్ధికి, విష్ణువు పాదములకు అధిదేవతలు, వీరి ప్రార్థనలవల్లన సర్వశక్తులు గలుగునని భావము.

బ్రహ్మమునకు నమస్సులు; వాయువా నీకునమసు
నీవె ప్రత్యక్ష బ్రహ్మవు, నిన్నెప్రత్యక్ష బ్రహ్మ
మనెదను; యథావిధి వచించెదను సత్యమునె వచింతు
అదియెనను గురున్ బ్రోచుతమదెనన్ను గురునిబ్రోచు॥

ఓమ్

శాంతి శాంతి శాంతి.

ఇది

మొదటియనువాకము.

## ద్వితీయో ఽనువాకః

శీక్షాం వ్యాఖ్యాస్యామః । వర్ణః స్వరః, మాత్రాబలం
సామసంతానః, ఇత్యుక్తః శీక్షాధ్యాయః॥

ఇందు వర్ణాదుల శిక్షణమును వ్యాఖ్యానింతుము, అకారాదులు వర్ణములు ఉదాత్తానుదాత్త స్వరితములు, హ్రస్వాదులు మాత్రలు వర్ణాద్యుచ్చారణ ప్రయత్నము బలము. మధ్యమముగా సమముగవర్ణముల నుచ్చరించుట సామము కలిపి యుచ్చరించుట సంతతి అనఁగా సంహిత ఈ విధముగా శిక్షాధ్యాయము చెప్పఁబడినది.

ఇతి
ద్వితీయో ఽనువాకః



# రెండవయనువాకము

అక్షరాదుల శిక్ష వ్యాఖ్యానింతుమిఁక; అకార ప్రభృతులక్షరము; లుదాత్త ప్రభృతుల్ స్వరములు, హ్రస్వ మాదిగలవి మాత్రలు; తత్ప్రయత్నంబు బలము; నాద సమతసామ; కల్పవచింపసంహిత, యిదియె శిక్ష॥

ఇది
రెండవయనువాకము.



## అథ

## తృతీయో ఽనువాకః

సహనౌ యశః సహనౌ బ్రహ్మవర్చసం, అథాతః
సంహితాయా ఉపనిషదం వ్యాఖ్యాస్యామః, పంచస్వధికరణేషు
అధిలోక మధిజ్యౌతిష మధివిద్య మధిప్రజ
మధ్యాత్మమ్. తా మహాసంహితా ఇత్యాచక్షతే,

మాకిద్దఱకు కీర్తికలుగుఁగాక మాకిద్దఱకు బ్రహ్మవర్చస్సు కలుగుఁగాక, ఇంకసంహితో పనిషత్తును అధికలోకము అధిజ్యౌతిషము అధి విద్యయు అధిప్రజము అను అయిదు అధికరణములలో వ్యాఖ్యానింతుము అవి మహాసంహితలని యందురు.

అథాధిలోకమ్ । పృథివీ పూర్వరూపమ్,
ద్యౌరుత్తరరూపమ్ ఆకాశః సంధిః, వాయుః సంధానమ్ ఇత్యధిలోకమ్॥

ఇంక అధి లోకమునుగూర్చి చెప్పఁబడుచున్నది, లోకములకు భూమి మొదటిరూపము దినము పైరూపము అంతరిక్షము వానిని గలుపుసంధి, గాలి వానిని కలుపునది. ఇది యధిలోకమునుగూర్చిన దర్శనము.

అథాధిజ్యౌతిషమ్, అగ్నిః పూర్వరూపమ్. ఆదిత్య
ఉత్తరరూపమ్. ఆపః సంధిః వైద్యుతః సంధానమ్. ఇత్యధిజ్యౌతిషమ్॥

ఇంక అది జ్యోతులను గూర్చిచెప్పఁబడు చున్నది జ్యోతులకు అగ్ని మొదటిరూపము సూర్యుఁడు పైరూపము, నీళ్లు వానిని గలుపుసంధి. మెఱపులె వానిని సంధాన పఱచునది. ఇది అధిజ్యౌతిషమును గూర్చిన దర్శనము.

అథాధివిద్యమ్, ఆచార్యః పూర్వరూపమ్, అంతేవా
స్యుత్తరరూపమ్, విద్యాసంధిః, ప్రవచనమ్ సంధానమ్. ఇత్యధివిద్యమ్॥

ఇంక అధి విద్యనుగూర్చి చెప్పఁబడుచున్నది. గురువు మొదటి రూపము శిష్యుఁడు తరువాతిరూపము, ఇద్దఱను గలుపుసంధి విద్య, విద్యను ప్రవచించుట సంధానము. ఇది విద్యనుగూర్చిన దర్శనము.

అథాధిప్రజమ్ మాతా పూర్వరూపమ్ పితోత్తరరూపమ్
ప్రజాసంధిః ప్రజననం సంధానమ్, ఇత్యధిప్రజమ్॥

ఇంక సంతానముగూర్చి చెప్పఁబడుచున్నది, దానికి తల్లి మొదటి రూపము తండ్రి పైరూపము, సంతానము ఆయిద్దఱను గలుపు సంధి సంతానము కలుగుట సంధానము. ఇది యధి ప్రజనుగూర్చిన దర్శనము.

మూఁడవయనువాకము,

స్వచ్ఛయశము కల్గుతమాకు బ్రహ్మవర్చసము కలుఁగు
త; మధిలోక మధిజ్యౌతిష మధివిద్యమధి ప్రజము
నవల నధ్యాత్మ మనునైదు నధికరణముల సంహి
తోపనిషదము వ్యాఖ్యచేతుము మహాసంహితలివె॥

సంహితోపనిషదము = సంహితలను గూర్చి దర్శనము. లోకములను జ్యోతిస్సులను గూర్చి విద్యనుగూర్చి సంతానమునుగూర్చి అధ్యాత్మమునుగూర్చి దర్శనము చెప్పఁబడును. ఇవి గొప్పదర్శనములుగాన మహాసంహితలనఁబడెను.

లోకదృష్టిఁగన్నడు నధిలోకంబు తెలుపఁబడును
భువనముదానికిఁ దొలిరూపు దినముపై రూపమగును
అంతరిక్షము సంధి రెండదిమిసంధానపఱచు
నదియె వాయువు, మఱియిదే యధిలోక వివరణంబు॥

ఇఁకనధి జ్యౌతిషము వివరింపఁగాఁబడును. నగ్ని
దానితొలిరూపు; సూర్యుండు దానిపై రూపమగును
జలముసంధి; యవ్వానిని సంధాన పఱచుచుండు
నది మెఱపుఁ గాంతియిది యధిజ్యౌతిష వివరణంబు॥

ఇంకనధి విద్యమిదె వివరింపఁగాఁ బడును గురువు
దాని తొలిరూపు; శిష్యుండు దాని పైరూపమగును
విద్యసంధి; యవ్వారిని విధిగసంధాన పఱచు
నదియె ప్రవచన మీయదియధి విద్య వివరణంబు॥

ఇఁక నధిప్రజమిదె వివరింపఁగాఁబడును; తల్లి
దానితొలిరూపు; తండ్రియెదానిపై రూపమగును
వారిసంధి సంతానము; వారిసంధాన పఱచు
నదియె ప్రజనన మీయది యధిప్రజావివరణంబు॥

అథాధ్యాత్మమ్. అధరాహనుః పూర్వరూపమ్. ఉత్తరా
హనురుత్తరరూపమ్ వాక్సంధిః, జిహ్వాసంధానమ్॥

ఇంక అధ్యాత్మముగూర్చి తెలుపఁబడుచున్నది. క్రిందిదవడదాని మొదటి రూపము పైదవడపైరూపము. వాక్కు రెంటికిసంధి. నాలుక సంధానపఱుచు నది, ఇది యధ్యాత్మనుగూర్చిన దర్శనము.

ఇతీమా మహాసంహితాః, య ఏవ మేతా మహా
సంహితా వేద సంధీయతే ప్రజయా పశుభిః బ్రహ్మ
వర్చసే నాన్నాద్యేన సువర్గేణ లోకేన॥

ఇవి మహాసంహితలు, ఈ మహాసంహితలను ఇట్లు ఎవఁడు తెలిసి కొనునో (=ఉపాసించును) వాఁడు సంతానముతోను పశువులతోను అన్నాదుల తోను స్వర్గలోకముతోను తులతూగుచుండును.

ఇతి
తృతీయో ఽనువాకః

ఇంక నధ్యాత్మమిదె వివరింపఁగాఁబడును; క్రింది
దవడ తొలిరూపుమగును; పైదవడ పైరూపమగును
వాక్కు—వానికి సంధియౌ; వానిసంధాన పఱచు
నదియెనాలుక; యీయదే యధ్యాత్మ వివరణంబు॥

ఇవి మహాసంహితల టందు; రిట్టిరీతి
నీ మహాసంహితల నుపాసింతురెవరు
వారు పుత్రులఁబశువుల బ్రహ్మవర్చ
సమును నన్నాదికమును స్వర్గమును గాంత్రు॥

ఇది

మూఁడవయనువాకము.



# అథ

## చతుర్థో ఽనువాకః

యశ్ఛందసా మృషభో విశ్వరూపః, ఛందోభ్యోఽధ్యమృతాత్సంబభూవ
సమేంద్రో మేధయాస్పృణోతు, అమృతస్య దేవ ధారణో భూయాసం॥

ఏది వేదములలో వృషభమువలె శ్రేష్ఠమై వేదములనుండి అమృతము నుండి (=ప్రజాపతినుండి) వ్యక్తమయ్యెనో అట్టియోంకారము సత్యకామములకు ఇంద్రుడైనన్నుఁ బ్రజ్ఞచే సంతోషపెట్టుఁగాక, ఓదేవా! నేను అమృతమైన బ్రహ్మ జ్ఞానమును ధరించువాఁడనగుదునుగాక.

శరీరం మే విచర్షణం, జిహ్వామే మధుమత్తమా,
కర్ణాభ్యాం భూరి విశ్రువం, బ్రహ్మణః కోశోఽసి మేధయాపిహితః
శ్రుతంమే గోపాయ

నా శరీరము సర్వకార్య సమర్థమగుఁగాక, నానాలుక మిగుల మధుర భాషిణియగుఁగాక, చెవులచే నెక్కువగ విందునుగాక, నీవు మేధచేఁగప్పఁబడిన బ్రహ్మకోశమవు నేను వినినయాత్మ జ్ఞానము రక్షింపుము.

ఆవహంతీతన్వానా కుర్వాణా ఽ చీరమాత్మనః వాసాంసిమమ
గావశ్చ అన్నపానేచ సర్వదా, తతోమేశ్రియమావహ
లోమశాం + పశుభిః సహస్వాహా

త్వరగా నాకు వస్త్రములను గోవులను అన్నపానములను ఎల్లపుడు రప్పించుచు వర్ధిల్లఁజేయుచుఁ బిదప నాకు మేకలు గొఱ్ఱెలు ఇతరపశులతోఁ గూడిన సిరినిగూర్చుము. నీకు హవ్యము అర్పింతుముగాక (ఇక్కడస్వాహా అన్నది హోమములు హోమముచేయు మంత్రము చివరను సూచించును)

ఆ మా యంతు బ్రహ్మచారిణః స్వాహా, వి మాయంతు బ్రహ్మచారిణః స్వాహా
ప్ర మా యంతు బ్రహ్మచారిణః స్వాహా, దమాయంతు బ్రహ్మచారిణః స్వాహా
శమాయంతు బ్రహ్మచారిణః స్వాహా॥

## ఇ ం క

### నాల్గవయనువాకము

శ్రుతులలో శ్రేష్ఠమై విశ్వరూపమై యుండెనేది
వేదములనుండి యజుసులో నేదిందు వ్యక్తమయ్యె
నాప్రణవ మీశుఁడై మేధ నాకిచ్చి ప్రీతియిడుత
నేనుదేవ! మోక్షముఁగూర్చు జ్ఞానమొందెదనుగాక॥

నాతనువు కార్యకరణ చణమగుత; నాదునాల్క-
కడుమధురముగఁబల్కుతఁ; గడుఁజెవుల్ వినెడుఁగాక
ప్రణవమా! మేధచేఁగప్పఁబడు బ్రహ్మకోశమీవు
నేను వినిపొందు జ్ఞానమున్ నిలిపి ప్రోచెదవుగాక॥

నాదుమేనికి వలువలు నన్నపానములుగోవు
లెపుడుఁగూర్చి వర్ధిలఁజేసి యెంతొ శీఘ్రింబగూర్చి
పశుల గొఱ్ఱెల మేఁకలవర్ధిల్లు సిరినినిడుము
ప్రణవమా: నీకుహవ్యముల్ స్వాహాయొనర్తు మెపుడు॥

"బ్రహ్మచారులు ననుఁజేర వత్తురిగాక" స్వాహ
"బ్రహ్మచారులు వివిధేచ్ఛ వత్తురిగాక" స్వాహ
"బ్రహ్మచారు వెక్కువమంది వత్తురిగాక" స్వాహ
"బ్రహ్మచారుల్ శమదములై వత్తురిగాక" స్వాహ

బ్రహ్మచారులు నన్నుఁగూర్చి వత్తురుగాక బ్రహ్మచారులు పశుస్వర్గ బ్రహ్మలోకాదివివిధ కాములై వత్తురుగాక బ్రహ్మచారులెక్కువగా వత్తురుగాక బ్రహ్మచారులు బాహ్యేంద్రియ నిగ్రహముగలవారై వత్తురుగాక బ్రహ్మచారులు అంతరింద్రియ నిగ్రహము గలవారై వత్తురుగాక. (స్వాహా అనియున్న చోటనెల్ల ఆమంత్రములు పలికి స్వాహా అని హోమముచేయవలయును).

యశోజనేఽసాని స్వాహా, శ్రేయాన్ వస్యసోఽసానిస్వాహా
తంత్వాభగ ప్రవిశానిస్వాహా, సమా భగప్రవిశస్వాహా తస్మిన్ సహస్రశాఖే,
నివిభగాహం త్వయి మృజేస్వాహా.

యశస్సుగల జనములో యశోవంతుఁడనై యుందునుగాక ధనవంతుల కంటె శ్రేష్ఠుఁడనై యుందునుగాక భగవంతుఁడా! అట్టినిన్నుఁ జేరుదునుగాక, భగవంతుఁడా ! నీవు నన్నుఁజేరుము భగవంతుఁడా ! అనేక శాఖలుగల నీయెడ నాపాపమును నన్నుశోధింతును.

యథాపః ప్రవతాయంతి, యథామాసా అహర్జరం
ఏవం మాం బ్రహ్మచారిణః, ధాతరాయంతు సర్వతః స్వాహా॥

నీళ్లు పల్లముగానెట్లు వెళ్లుచున్నవో ఎట్లుమాసములు సంవత్సరమును బొందుచున్నవో యట్లు నన్నుఁగూర్చి బ్రహ్మచారులు ఓధాతా ' అన్నివైపుల నుండి వత్తురుగాక సాహా,

ప్రతివేశోఽసి

ప్ర మా భాహి ప్ర మా, పద్యస్వ

ఓధాతా, నీవు మా యిరుగుపొరుగువాఁడవు, నన్నుగూర్చి నాయాత్మను బ్రకాశింపఁజేయుము అందుకై వీడి నన్ను అనుగ్రహింపుము.

ఇతి

చతుర్థానువాకః

ఇవిగురు వాక్యములు. స్వాహాఅనియున్న చోటులనెల్ల ఆ మంత్రములు పలికి "స్వాహా" అనుచు హోమముచే యవలయునని భావము.

"యశసు గలవారిలో యశమందుదుఁగాక" స్వాహ
"అతిధనులకంటె శ్రేష్ఠుఁడ నయియుందుఁగాక" స్వాహ
"అనఘ! నేనిన్నుఁజేరుదు, ననునీవుచేరు" స్వాహ
"నీదువేలశాఖల నను శోధించుకొందు" స్వాహ॥

"నీరుపల్లంబునకు వేగఁజేరునట్లు
నెలలుసంవత్సరంబును గలియునట్లు
బ్రహ్మచారులు సర్వపార్శ్వములనుండి
నాకడకుధాత! వత్తురుగాక "స్వాహ"

ఈ నాల్గవయనువాకమందు మేధసిద్ధించుట కనువైన మంత్రములు చెప్పబడెను.

మాయిరుగు పొరుగిల్లు మసలుదీవు
మాకు నాయాత్మ ప్రకటింపుమమ్మఁగనుము
బ్రహ్మచారులు శాంతినెల్ల దరినుండి
నా కడకుధాత! వత్తురుగాక "స్వాహ"

ఇది

నాల్గవయనువాకము.

## అథ

## పంచమః అనువాకః

భూర్భువస్సువరితి వా ఏతా స్తిస్రోవ్యాహృతయః
తాసా ముహస్మైతాం చతుర్థీం మహాచమస్యః
ప్రవేదయతే మహ ఇతి । తద్బ్రహ్మ, స ఆత్మా
అంగా న్యన్యా దేవతాః॥

భూః భువః సువః అను నీమూఁడును వ్యాహృతులు, ఆవ్యాహృతులలో మహః అను నీ నాల్గవ వ్యాహృతిని మహాచమస్యుఁడను ఋషి దర్శించెను. మహః అను వ్యాహృతియె బ్రహ్మము, అదియె ఆత్మ, మహః అనువ్యాహృతికి సూర్యచంద్రాదిదేవతలు లోకములు అంగములు.

భూరితి వా అయంలోకః, భువ ఇతి అంతరిక్షం, సువరిత్యసౌలోకః
మహ ఇత్యాదిత్యః, ఆదిత్యేన వావ సర్వేలోకా మహీయంతే ఇతి।

భూవు అనఁగా ఈలోకము, భువము అనఁగా అంతరిక్షము సువము అనఁగా ఆలోకము, మహమనఁగా సూర్యుఁడు, సూర్యునిచేతనే సర్వలోకములు వర్ధిల్లుచున్నవి.

భూరితివా అగ్నిః, భువ ఇతివాయుః, సువరిత్యాదిత్యః
మహ ఇతి చంద్రమాః, చంద్రమసావాప సర్వాణి జ్యోతీంషి మహీయంతే॥

భూవు అనగా అగ్ని, భువము అనఁగా గాలి, సువము అనగా సూర్యుఁడు మహమనఁగా చంద్రుఁడు, చంద్రునిచేతనే చంద్రమండలమందున్న జ్యోతులు వర్ధిల్లుచున్నవి.

భూరితితా ఋచః, భువ ఇతి సామాని సువరితి యజూంషి
మహ ఇతి బ్రహ్మ బ్రహ్మణావావ సర్వేవేదా మహీయంతే॥

భూవు అనఁగా ఋక్కులు, భువము అనఁగా సామములు సువమనఁగ యజుస్సులు మహమనఁగా బ్రహ్మము (ఓంకారము) ఈ బ్రహ్మముచేతనే సర్వ వేదములు వర్ధిల్లుచున్నవి.

అయిదవయనువాకము.

భూవు, భువము, సువంబను మూఁడువ్యాహృతులు వరలు
వానిలో నాల్గవది మహంబనునది; మహమునకును
ద్రష్ట మాహాచమస్యుండు; బ్రహ్మంబునదియె, యాత్మ
యదియె; యీవ్యాహృతికి దేవతాదిక మవయవములు॥

వివిధ కర్మలందు వ్యాహరింపఁబడును పలుకఁబడునుగాన వ్యాహృతి, లోకాదులను మహత్త్వమును బొందునుగాన మహము, అంతట వ్యాపించునుగాన ఆత్మ అని వ్యుత్పత్తులు.

భూవనంగ నీలోకము, భువమనంగ
నంతరిక్షము, సువమన నాజగంబు
మహమనఁగ సూర్యుఁ, డాసూర్యమహిమచేత
నెల్లలోకముల్ మిగుల వర్ధిల్లుచుండు॥

భూవనఁగ నగ్నిహోత్రము, భువమనంగ
మారుతము, సువమర్కుండు, మహమనంగ
చంద్రుఁ, డాచంద్రుచేతనె చంద్రులోని
యెల్లజ్యోతులు మిగుల వర్ధిల్లుచుండు॥

భూవనగ ఋక్కులు మఱియు భువమనంగ
సామములు, సువంబన యజుస్సమరుచుండు
మహమనఁగ నోంకారమట్టి యోమె
యెల్ల వేదంబులఁగడు వర్ధిల్లఁజేయు॥

భూరితివై ప్రాణః భువ ఇత్యపానః సువరితివ్యానః
మహ ఇత్యన్నం, అన్నేన వావసర్వేప్రాణా మహీయంతే॥

భువమనఁగా ప్రాణము, భువనమనఁగా అపానవాయువు, సువమనఁగా వ్యానవాయువు. మమనగా అన్నము అన్నముచేతనే సర్వప్రాణములు వర్ధిల్లు చున్నవి.

తావా ఏతాశ్చతస్రశ్చతుర్ధా, చతుస్రశ్చతుస్రో
వ్యాహృతయః, తాయో వేద, సవేదబ్రహ్మ
సర్వేఽస్మైదేవతా బలిమావహంతి॥

ఆ యీనాల్గు వ్యాహృతులును లోకదృష్టి, దేవదృష్టి, వేదదృష్టి ప్రాణ దృష్టులనుబట్టి నాల్గు, నాల్గు విధములుగ నుండును. వానినెవఁడు తెలిసికొనునో వాఁడు బ్రహ్మమును దెలియును. వీనికి సర్వదేవతలు పూజలు సల్పు చుందురు.

ఇతి
పంచమోఽనువాకః

అథ

## షష్ఠో ఽనువాకః

సయ ఏషోంఽతర్హృదయ ఆకాశః, తస్మిన్నయం పురుషో
మనోమయః, అమృతో హిరణ్మయః అంతరేణ తాలుకే
య ఏష స్తన ఇవావలంబతే సేంద్రయోనిః, యత్రాసౌ
కేశాంతో వివర్తతే, వ్యపోహ్య శీర్షకపాలే॥

హృదయములోపలనెట్టి యాకాశమున్నదో దానియందు జ్ఞానమయుఁడు శాశ్వతుఁడు జ్యోతిర్మయుండునగు నీపురుషుఁడు గలఁడు. తాలువులమధ్య స్తనమువలె వ్రేలాడు మాంసఖండము (అంగుడు) గలదు అక్కడ సుషుమ్న అనునాడిగలదు అదే ఇంద్రునికి (బ్రహ్మకు) మార్గము పాపిడియున్నచోట అది తలనుబుఱ్ఱను జీల్చుకొని పైకివెడలినది.

భూవనఁగఁ బ్రాణము, మఱియాభువమన న
పానము, మఱిసువంబన వ్యానమగును
మహమనఁగనన్న; మాయన్న మహిమచేత
నెల్ల ప్రాణముల్ మిగుల వర్ధిల్లుచుండు॥
భూవు భువము సువము మహము నని వ్యాకృతుల్ నాల్గు
నాల్గు విధములౌ; నవినాల్గుగా నమరుచునుండు
వానిఁ దెలిసికొనినవాఁడు బ్రహ్మంబు దెలిసికొనును
పూని దేవులెల్లరు వీనిఁ బూజించు చుందురెవుడు॥

ఈ లోకము, అగ్ని ఋగ్వేదము ప్రాణము అనునవి భూఃఅను మొదటి వ్యాహృతి. అంతరిక్షము గాలిసామములు భువఃఅని రెండవ వాహృతి. ఆలోకము సూర్యుండయ జుస్సులు వ్యానము అనునవి సువఃఅను మూడవ వ్యాహృతి. సూర్యుఁడు చంద్రుఁడు బ్రహ్మము అన్నము అనునవి మహః అను నాల్గవ వ్యాహృతి. ఇట్లు నాల్గు విధములుగా నుండునని భావము.

ఇది
యయిదవ యనువాకము.

ఇంక
ఆఱవయనువాకము.

ఈ హృదయ కమలములోన నెసఁగు నాకాశమందు
జ్ఞానమయుఁ డమృతమయుఁడు హిరణ్మయుఁడు నౌపురుషుఁడుండు
తాలుమధ్య, నంగిటి మధ్యతలఁ బుట్టెఁజీల్చుకొని సు
షుమ్నునాడి పాపటను జొచ్చును నదెబ్రహ్మ వీధి॥

మనుష్యుఁడు ధ్యానాదులద్వారా ఆసుషుమ్నానాడిని మేల్కొనిపి గాంచి నచో బ్రహ్మస్వరూపమును గాంచుననియు ఆనాడియె బ్రహ్మను బొందించు మార్గమనియు యోగశాస్త్రమందుఁ జెప్పఁబడెను.

భూరిత్యగ్నౌ ప్రతి తిష్ఠతి, భువ ఇతి వాయౌ
సువరిత్యాదిత్యే, మహ ఇతి బ్రహ్మణి, ఆప్నోతి
స్వారాజ్యం, ఆప్నోతి మనస్పతిం

ఆనాడిద్వారా మనోమయాత్మను దర్శించినవాఁడు భూవను నగ్నియందు ఉండును, భువమను వాయువునందు సువమను సూర్యునందు మహమమను బ్రహ్మమందు ఉండును. అతఁడు స్వారాజ్యమును బొందును మనస్సునకు ప్రభువైన బ్రహ్మమను బొందును.

వాక్పతి శ్చక్షుష్పతిః, శ్రోత్రపతి ర్విజ్ఞానపతిః
ఏత త్తతో భవతి, ఆకాశ శరీరం బ్రహ్మ, సత్యాత్మ
ప్రాణారామం మన ఆనందం శాంతిసమృద్ధ మమృతం
ఇతి ప్రాచీనయోగ్య ఉపాస్స్వ॥

అట్లు స్వారాజ్యమును బ్రహమును బొందినవాఁడు వాక్కులకుఁ బతియై నేత్రపతియై శ్రోత్రములకు బతియై విజ్ఞానపతియై యగును. పిదప ముందు చెప్పఁబోవు నట్లులగును. ఆకాశముతో సమానశరీరము గలిగి బ్రహ్మమై సత్యస్వరూపమై ప్రాణములందు విహరించుచు మనస్సున నానందమొందుచు శాంతిచే సమృద్ధమై అమృత స్వరూపమైయుండును. ఇట్లు ఓ ప్రాచీనయోగ్య ! దీనిని ఉపాసింపుము.

ఇతి
షష్ఠోఽనువాకః

## అథ
## సప్తమోఽనువాకః

పృథివ్యంతరిక్షం ద్యౌర్దిశోఽవాంతరదిశః, అగ్నిర్వాయు
రాదిత్యశ్చంద్రమా నక్షత్రాణి, ఆప ఓషధయో వన
స్పతయ ఆకాశ ఆత్మా, ఇత్యధిభూతం అథాధ్యాత్మం

అది గనినవాఁడు భూవను నగ్నియందు
భువమనెడు గాలి, సువమను రవి, మహమను
బ్రహ్మఁగలిసి యగ్న్యాదిరూపముల నిందు
వఱలి స్వారాజ్యమొందును బ్రహ్మమొందు॥

మహమనెడు బ్రహ్మమునకు అంగములకు అగ్ని వాయు సూర్యుల రూపములను యజమానుఁడు మహమను బ్రహ్మస్వరూపమును బొంది వారి యైశ్వర్యములను గాంచునని భావము.

అతఁడు విజ్ఞానపతి, నేత్రపతి, శ్రోత్రవాక్పతియగు
అవల నాకాశ నిభదేహములరఁగ సత్యరూప
మగుచుఁ బ్రాణవిహారియై, యానంద శాంతమగుచు
నమృతమై బ్రహ్మము; దీనిఁబ్రాచీన యోగ్య! కొలువు॥

ఇది

ఆఱవయనువాకము

## ౭ంకే

ఏడవయనువాకము

ౖవియంతరిక్షము దివిదిశల్ విదిశలు, పరుగునవి లోకపంచకంబు
గ్ని వాయువు చంద్రుఁడర్కుఁడు నక్షత్రమను నివిదేవతాపంచకంబు
ఒమోషధులు వనస్పతులు నాకాశంబు స్వచ్ఛాత్మ యివిభూతపంచకంబు

ప్రాణో వ్యానోఽపాన ఉదానః సమానః। చక్షుః శ్రోత్రం
మనోవాక్త్వక్। చర్మ మాసం స్నావాస్థి మజ్జా,
ఏతదధి విధాయ ఋషిరవోచత్, పాంక్తం
వా ఇదంసర్వం। పాంక్తేనైవ పాంక్తంస్పృణోతీతి॥

భూమి అంతరిక్షము, దివము దిక్కులు అవాంతరదిక్కులు ఇదిలోక పంచకము వానియుపాసన అధిలోకమందురు. నిప్పుగాలి సూర్యుడు చంద్రుడు నక్షత్రములు ఇవి దేవతాపంచకము వీని యుపాసన అధిదైవమందురు. నీళ్లు ఓషధులువనస్పతులు ఆకాశము ఆత్మ ఇవిభూతపంచకమువీని యుపాసన అధి భూత మందురు, ఇంక ఆధ్యాత్మోపాసన గూర్చి చెప్పఁబడుచున్నది, ప్రాణము వ్యానము అపానము ఉదానము సమానము ఇవి వాయుపంచకము, కన్ను చెవి మనస్సు వాక్కుత్వక్కు ఇవి ఇంద్రియ పంచకము చర్మము మాంసము వస ఎముకలు మజ్జ ఇవి ధాతు పంచకము, వీనిని ఉపాసింపఁదగినవిగా విధించి ఋషితెలిపెను, ఈ జగమంతయు పంచసంఖ్యలతోఁ గూడినది. పంచసంఖ్యలతో గూడిన యుపాసనతోనే పంచసంఖ్యాత్మకమైన విరాడ్రూపయజ్ఞమును సంతోష పెట్టి పొందును.

ఇతి
సప్తమోఽనువాకః

## అథ
## అష్టమోఽనువాకః

ఓమితిబ్రహ్మ, ఓమితీదం సర్వం। ఓమిత్యే తదనుకృతి
ర్హస్మవా అప్యోశ్రావ యేత్యాశ్రవయంతి, ఓమితి
సామానిగాయంతి। ఓంశోమితి శస్త్రాణి శంసంతి
ఓమిత్యధ్వర్యుః ప్రతిగరం ప్రతిగృణాతి, ఓమితి
బ్రహ్మప్రసౌతి। ఓమిత్యగ్ని హోత్ర మనుజానాతి

ఇది యధిలోకము నధిదైవ మధిభూత; మింకనధ్యాత్మవచింపఁబడును
ప్రాణ మపాన ముదానసమానముల్ వ్యానమునివి వాయుపంచకంబు
కనులును జెవులును మనసును వాక్కును త్వక్కును నింద్రియ పంచకమివి

చర్మ, మాంస మస్థులు మజ్జస్నాయులివ్వి
ధాతుపంచక; మిటుఋషి తగవిధించె
అయిదుగా నున్నయజ్ఞమే యఖిలమిద్ది
పంచకముచేత నిండును బంచకమ్ము॥

యజ్ఞమునకు ౧ పత్ని ౨ యజమానుఁడు ౩ దైవము ౪ మనుష్యులు ౫ ధనము అనునైదవయములున్నట్లే లోకములకు భూమ్యాదులైన యైదవయములు గలవు. ప్రాణాదులైన యధ్యాత్మక పంచకముచే భూమ్యాదులైన బాహ్య పంచకము నిండును. ఇట్లునిండి యజ్ఞరూపమగును. దీనిని దెలిసినవాఁడు బ్రహ్మమగునని భావము.

ఇది

ఏడవయనువాకము

## ఓం

ఎనిమిదవయనువాకము

"ఓమ్" అనునదేబ్రహ్మ ఓమెసర్వంబు "ఓం" అనుకరించెదరు, ఓమనివినుతురు
ఓమని గావింత్రు సామగానంబులు, ఓంశోమనుచు శస్త్రమొగిస్తుతింత్రు
ఓమని యధ్వర్యు వుత్సాహమునఁబల్కు, నోమనిబ్రహ్మయనుజ్ఞనిచ్చు
హోమంబు చేయుదు మోమని ఓమని యగ్నిహోత్రమునకు ననుమతించు

వైదిక ప్రవచనముల బ్రాహ్మణుండు
చెప్పుకొనుచు నాత్మనెఱుంగఁ జెప్పుకొనుచు

ఓమితిబ్రాహ్మణః ప్రవక్ష్యన్నాహ। బ్రహ్మో పా
ప్న వాసీతి। బ్రహ్మై వో పా ప్నోతి॥

ఓం అనునది బ్రహ్మము. ఇదంతయు ఓంకారమె, మంత్రోచ్చారణ మందు ఓం అని అనుకరణము చేయుదురు, ప్రైషపూర్వకముగా పలుకునపుడు ఓం అని వినిపింతురు, ఓం అని సామలు గానముచేయుదురు. ఓం శోం అని శస్త్రములను ప్రశంసింతురు. ఓం అని అధ్వర్యుడు ప్రోత్సాహముతో పలుకును. ఓం అని బ్రహ్మ ఋత్విక్కు అనుమతించును, హోమముచేయుటకై అగ్నిహోత్రమును గూర్చి ఓం అని యనుజ్ఞయిచ్చును, బ్రాహ్మణుఁడు వేదములను ఆత్మనుగూర్చి చెప్పఁదలఁపఁబోవుచు బ్రహ్మమును బొందుదునని తలఁచుచు ఓం అనును. దీనిచే బ్రహ్మమును బొందును.

ఇతి

అష్టమోఽనువాకః

అథ

## నవమోఽనువాకః

ఋతంచ స్వాధ్యాయ ప్రవచనేచ, సత్యంచస్వాధ్యాయ ప్రవచనేచ
తపశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ, దమశ్చస్వాధ్యాయ ప్రవచనేచ
శమశ్చస్వాధ్యాయ ప్రవచనేచ, అగ్నయశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ
అగ్నిహోత్రంచ స్వాధ్యాయ ప్రవచనేచ, అతిథయశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ
మానుషం చస్వాధ్యాయ ప్రవచనేచ, ప్రజాచ స్వాధ్యాయ ప్రవచనేచ
ప్రజనశ్చ స్వాధ్యాయ వచనేచ, ప్రజాతిశ్చ స్వాధ్యాయ ప్రవచనేచ

స్వకర్తవ్యము వేద పఠన పాఠనములు ఆచరింపఁదగినవి, సత్యము వేదపఠన పాఠనము లాచరింపఁదగినవి. తపస్సు వేదపఠన పాఠనములాచరింప దగినవి. బాహ్యేంద్రియ నిగ్రహము వేదపఠన పాఠనములాచరింపఁ దగినవి.

వేదమును బ్రహ్మమునుగాంతు వేగననుచు
ఓమనును; దీనిచే బ్రహమొంది తీరు॥

ఇదివరకు వ్యాహృతిరూపమైన బ్రహ్మోపాసనలు చెప్పి మరల పంచ సంఖ్యలతోఁ గూడిన బ్రహ్మోపాసనమే చెప్పఁబడెను. ఇప్పుడు సర్వోపాసనలకు అంగమైన ఓంకారోపాసమును దానివల్లఁగలుగు ఫలితమును చెప్పఁబడెను.

ఇది

ఎనిమిదవయనువాకము.

ఇంక

తొమ్మిదవయనువాకము.

చేయవలె స్వధర్మమును స్వాధ్యాయమున్ బ్రవచనమును
చేయవలయు సత్యమును స్వాధ్యాయమున్ బ్రవచనమును
చేయవలయుఁ దపమును స్వాధ్యాయమున్ బ్రవచనమును
చేయవలయు దమమును స్వాధ్యాయమున్ బ్రవచనమును
చేయవలయు శమమును స్వాధ్యామున్ బ్రవచనమును
చేయవలె నగ్నికర్మ స్వాధ్యాయమున్ బ్రవచనమును
చేయవలయు హోమమును స్వాధ్యాయమున్ బ్రవచనమును
చేయుమి యతిథిపూజ స్వాధ్యాయమున్ బ్రవచనమును
చేయవలె లోకహితము స్వాధ్యాయమున్ బ్రవచనమును

అంతరింద్రియ నిగ్రహము వేదపాఠనములు ఆచరింపఁదగినవి. అగ్నిని ఆధానముచేయుట వేదపఠన పాఠనములు ఆచరింపదగినవి. హోమముచేయుట వేద పఠన పాఠములు ఆచరింపదగినవి. అతిథిపూజ వేదపఠన పాఠములు ఆచరింపఁదగినవి. మనుజ కార్యములు వేద పఠనపాఠములు ఆచరింపదగినవి' సంతానము గనుట వేదపఠన పాఠములు ఆచరింపదగినవి, ఋతుకాలమున భార్యను గలియుట వేదపఠన పాఠములు ఆచరింపదగినవి. పౌత్రదర్శనము వేద పఠన పాఠములు ఆచరింపదగినవి.

సత్యమితి సత్యవచా రాథీతరః। తప ఇతి
తపోనిత్యః పౌరుశిష్టిః, స్వాధ్యాయ ప్రవచనే ఏవేతినాకో మౌద్గల్యః
తద్ధి తపః తద్ధి తపః ॥

సత్యమె ఆచరింపఁ దగినదని సత్యవచనుఁడగు రాథీతరుఁడు పల్కెను. తపస్సె ఆచరింపఁదగినదని తపోనిష్ఠుఁడగు పౌరుశిష్టియనెను. స్వాధ్యాయ ప్రవచనములే యాచరింపఁ దగినవని ముద్గలునికుమారుఁడగు నాకుఁడనియె. అదే తపస్సు అదేతపస్సు.

ఇతి
నవమోఽనువాకః

**అథ**

**దశమోఽనువాకః**

అహం వృక్షస్యరేరివా, (ప్రేరకః) కీర్తిః పృష్ఠంగిరే రివ
ఊర్ధ్వ పవిత్రో వాజినీవ, స్వమృతమస్మి॥

నేను సంసారమనెడి వృక్షమునకుఁ బ్రేరకుఁడను. నాకీర్తి పర్వత శిఖరమువలె నున్నతమైనది. నాకు ఉత్తమమైన బ్రహ్మము పవిత్రకారణము. సూర్యునందలి తేజస్సువలె శుభమైన యమృతస్వరూపుఁడను.

అందవలెను సంతతిని స్వాధ్యాయమున్ ప్రవచనమును
చేయుమిఋతు గమనము స్వాధ్యాయమున్ ప్రవచనమును
చేయవలెఁ బౌత్రదృష్టి స్వాధ్యాయమున్ ప్రవచనమును

స్వాధ్యాయము=వేదాధ్యయనము లేక మోక్షశాస్త్రాధ్యయనము. ప్రవచనము=స్వాధ్యాయమును జెప్పుట. అన్నిటితోఁగలిపి స్వాధ్యాయప్రవచనములను గలిపి జెప్పుట. వానిని అవశ్యము ఆచరింపవలయునని తెలుపుటకని తెలియునది. స్వాధ్యాయమువల్లఁబురుషార్థ జ్ఞానముగలుగునని భావము.

సత్యమెవచింప సత్యవచసుఁడు రాథీతరుఁడనె
తపమె చరియింపుమనె నిత్యతపసుఁడు పౌరుశిష్టి
సలుపవలయుఁ గేవలమొక్క స్వాధ్యాయ ప్రవచనములె
యనియె మౌద్గల్యుఁడగు నాకుఁ; డదెతపంబదియె తపము

ఇది

తొమ్మిదవయనువాకము

## ఇంక

## పదవయనువాకము.

నేను సంసారవృక్షంపుఁ బ్రేరకుఁడను
గిరిశిఖరమట్లు నాకీర్తి శిరముఖెత్తు
విశ్వరూపమౌ బ్రహ్మ పవిత్రకారి
యమృతమూర్తిని సూర్యాంతరాత్మవోలె॥

ద్రవిణం సువర్చసం, సుమేధా అమృతోక్షితః
ఇతి త్రిశంకోర్వేదాను వచనం॥

ధనము వర్చస్సునగు నాత్మతత్త్వమను, మంచి మేధగలవాఁడను అమృతముచేఁ దడుపఁబడినవాఁడను అనునిది త్రిశంకుని వేదవాక్యము.

ఇతి

దశమోఽనువాకః

అథ

## ఏకాదశోఽనువాకః

వేదమనూచ్య ఆచార్యోఽంతేవాసిన మనుశాస్తి
సత్యంవద, ధర్మంచర, స్వాధ్యాయా న్మాప్రమదః
ఆచార్యాయ ప్రియంధన మాహృత్య ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః
సత్యాన్నప్రమదితవ్యం ధర్మాన్న ప్రమదితవ్యం
కుశలాన్న ప్రమదితవ్యం భూత్యైనప్రమదితవ్యం
స్వాధ్యాయ ప్రవచనాభ్యాం నప్రమదితవ్యం
దేవపితృ కార్యాభ్యాం నప్రమదితవ్యం॥

ఉపనయనము (తనదగ్గరకుఁదీసికొనుట) అయిన పిదప ఆచార్యుఁడు వేదము చెప్పి శిష్యునికి ఈ క్రింది విధముగాఁ దప్పకచేయుమని అనుశాసనము చేయును. సత్యముపలుకుము ధర్మము ఆచరింపుము వేదాధ్యయనములోఁ బ్రమాదపడకు, ఆచార్యునకిష్టమైన ధనమును దక్షిణముగానిచ్చి సంతానమనెడి తీగను త్రెంపకుము. సత్యమునుండి ప్రమాదపడకు. ధర్మమునుండి ప్రమాద పడకు. నీక్షేమము నుండి ప్రమాదపడకు. శుభకర్మమునుండి ప్రమాదపడకు వేదాధ్యయనము అధ్యాపనములలోఁ బ్రమాదపడకు దేవతలకుఁ బితరులకు సంబంధించిన కార్యములలోఁ బ్రమాదపడకుము.

ధనము వర్చస్సు నగునాత్మ తత్త్వంబునేను
తత్త్వమెఱింగిన మేధస్సుదనరువాఁడ
ఒడల నమృత ధారలఁ జల్లఁబడెడువాఁడ"
వర త్రిశంకుని వేదానువచన మిద్ది

ఇది

పదవయనువాకము

ఇంక

పదునొకండవయనువాకము.

వేదమును యథోక్త విధిఁ జెప్పియాచార్యుఁ
డిఁక శిష్యుని ననుశాసించు నిట్లు
"సత్యంబు పలుకుము, సలుపు ధర్మంబు, స్వా
ధ్యాయమునెడఁ బ్రమాదంబు పడకు
ఆచార్యునికిఁ బ్రియంబైన ధనంబిమ్ము
సంతానలతికఁ ద్రెంచకుము సుమ్ము
ధరణి సత్యమునుండి పొరపాటుచెందకు
ధర్మంబునెడఁ బ్రమాదంబు పడకు

స్వకుశలంబునుండి ప్రమాదపడఁగరాదు
ఎడఁద శుభమునుండి ప్రమాదపడఁగరాదు
పడకుపొరపాటు స్వాధ్యాయ ప్రవచనముల
దేవపితృకార్యములఁ బ్రమాదింపరాదు॥

మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ
అతిథిదేవోభవ, యా న్యనవద్యాని కర్మాణి
తాని సేవితవ్యాని. నో ఇతరాణి, యాన్యస్మాకం
సుచరితాని తానిత్వయోపాస్యాని నో ఇతరాణి॥

తల్లి దైవముగాఁ గలవాఁడవగుము, తండ్రిదైవముగాఁ గలవాఁడవగుము గురువు దైవముగాఁ గలవాఁడవగుము అతిథిదైవముగాఁ గలవాఁడవగుము నిర్దుష్టములైన కర్మలె సేవింపఁదగినవి. ఇతరములు సేవింపఁ దగినవిగావు, మా యొక్క సత్కర్మలే నీచే నుపాసింపఁదగినవి. ఇతరకర్మలు ఉపాసింపఁ దగినవికావు.

యేకే చాస్మచ్ఛ్రేయాంసో బ్రాహ్మణాః తేషాం
త్వయాఽఽసనేన ప్రశ్వసితవ్యం। శ్రద్ధ యా దేయం
అశ్రద్ధయాఽదేయం। శ్రియాదేయం। హ్రియాదేయం భియాదేయం
సంవిదాదేయం। అథయదితే కర్మ విచిత్సా వా వృత్త
విచికిత్సా వాస్యాత్। యేతత్ర బ్రాహ్మణాః సంమర్శినః
యుక్తా ఆయుక్తా అలూ (రూ) క్షాధర్మకామాః స్యుః
యథాతే తత్ర వర్తేరన్ తథా తత్ర వర్తేథాః॥

ఎవరైతే మనలో శ్రేష్ఠులైన బ్రాహ్మణులుగలరో వారికి ఆసనముచే నీవు శ్రమపోగొట్టవలయు. శ్రద్ధతో వారికి ఇయ్యవలయు. అశ్రద్ధతో ఈయవలదు అశ్రద్ధతోనైనను ఈయవగు అనియుఁ జెప్పవచ్చును.) శుభదృష్టితో ఈయ వలయు. శాస్త్రాది భయముతో నీయవలయు, దేశకాల పాత్రాది జ్ఞానముతో ఈయవలయు. కర్మలలో సందేహముగాని నడతలో సందేహముగాని నీకుఁ

ఎనిమిదవయేట వేదాధ్యయనమునకై గురువుదగ్గఱకుఁ బంపుసంస్కారమును ఉపనయనమందురు. ఆ యుపనయన సంస్కారమైన పిదప వేదములను జెప్పి విద్యచెప్పుట పూర్తియయినపిదప శిష్యుఁడు గృహస్థాశ్రమము స్వీకరింపఁ బోవునపుడిట్లు గురువు చెప్పును. విద్యాగ్రహణమైన పిదప ఇంటికివచ్చుటను సమావర్తన మందురు.

దేవతగఁ దల్లి నెంచుము దేవుఁగా దండ్రినెంచు
దేవుఁగానెంచు మాచార్యు; దేవుఁగానతిథి నెంచు
నెఱపుమి యనింద్యకర్మల; నింద్యముల్ చేయఁదగదు
మేముచేయు మంచియె చేయుమితరంబు చేయఁదగదు॥

"పరశురాముఁడు తండ్రియాజ్ఞచేఁ దనతల్లిని జంపుట మొదలగువానిలో పితృాజ్ఞారూపమైన యనింద్య కర్మయే యాదరింపఁదగును గాని తల్లిని జంపుట మొదలగు నింద్యకర్మ చేయరాదని భావము.

మనలోన శ్రేష్ఠులైమనెడు బ్రాహ్మణుల కా
 సనమిడ శ్రమపోవఁ దనుపవలయు
ఇడునది శ్రద్ధతో నీయఁగావలె; మఱి
 * యశ్రద్ధతోడ నీయంగవలదు
సిరితోడ నీయుము సిగ్గుతో నీయుము
 భీతితోఁ బ్రీతితో నీయవలయు
మఱియందు నీకుఁగర్మలలోనఁగాని శి
 ష్టాచార మందేని సంశయ ము

కలుగుచో నపుడా దేశకాలములను
శిష్టులై విమర్శకులై సుశిక్షితులయి
బహుమృదువులై యకాములౌ బ్రాహ్మణులిట
నెటు ప్రవర్తింతు రటె ప్రవర్తింతుమోయి॥

మూలములో "అశ్రద్ధయాదేయం" అనుచోట 'అశ్రద్ధయాఅదేయం' అని పదవిభాగము చేసినపుడు "అశ్రద్ధతోడ నీయంగవలదు" అనియర్థము. "అశ్రద్ధ

---

* అశ్రద్ధనైన నీయంగవలయు" అని దీనికి అర్థాంతరము చెప్పుదురు. అపుడు "అశ్రద్ధనైన నీయంగవలయు" అని చదువుకొనవలయును.

గలిగినచో వానివిషయములో విమర్శకులు యోగ్యులు అభియుక్తులు మొత్తని హృదయము గలవారు ధర్మ కాములునైన బ్రాహ్మణులెట్లు ప్రవర్తింతురో యట్లేనీవును ప్రవర్తింపుము.

అథా భ్యాఖ్యాతేషు। యే తత్ర బ్రాహ్మణాః
సంమర్శినః యుక్తా ఆ యుక్తాః అలూ (రూ) క్షా
ధర్మాకామాః స్యుః యథాతే తేషువర్తేరన్
తథా తేషు వర్తేథాః

ఏదో యొక దోషముగల యభియుక్తుల విషయములోను విమర్శకులు యోగ్యులు అభియుక్తులు మెత్తనిహృదయము గలవారు ధర్మకాములనైన బ్రాహ్మణులెట్లు ప్రవర్తింతురో యట్లే నీవును ప్రవర్తింపుము.

ఏష ఆదేశః ఏష ఉపదేశః ఏషావేదోపనిషత్
ఏత దనుశాసనం। ఏవముపాసితవ్యం। ఏవముచైత దుపాస్యం॥

ఇది ఆజ్ఞ, ఇదియుపదేశము, ఇది వేదరహస్యము ఇదియేవేదానుశాసనము, ఇట్లు ఉపాసింపవలయు. ఇట్లు ఉపాసింపవలెను.

ఇతి

ఏకాదశోఽనువాకః

అథ

## ద్వాదశో ఽనువాకః

ఓంశంనో మిత్రః శంవరుణః। శంనో భవత్వర్యమా,
శంన ఇంద్రో బృహస్పతిః శంనో విష్ణురుక్రమః

యాదేయం అని పదవిభాగము చేసినపుడు అశ్రద్ధతోనైనను దానము చేయవలసి నదేయని యర్థము చేసికొన్నపుడు "అశ్రద్ధతోను నీయంగవచ్చు" అనుపాఠము చదువు కొనవలయును.

మఱి ప్రసిద్ధులలోను బ్రమాదమొదవ
శిష్టులై విమర్శకులై సుశిక్షితులయి
బహుమృదువులై యకాములౌ బ్రాహ్మణులిట
నెట్టుప్రవర్తింతు రటుప్రవర్తింపుమోయి॥
ఇదియే యాదేశము మఱి
ఇదియే యుపదేశము మఱి మిదివేదార్థం
బిదెయీశ్వరానుశాసన
మదియె యుపాసింపఁదగు నుపాసింపఁదగున్॥

## ఇది
## పదునొకండవయనువాకము.

## ఇంక
## పండ్రెండవ యనువాకము.

శుభమిడుత రవిమాకు శుభమిడుత వరుణుండు
శుభమిడుత అర్యముఁడు శుభమిడుత ఇంద్రుండు
శుభమిడుత బృహస్పతి శుభమిడుత మాకెపుడు
విభువయి విశాలముగ విహరించు విష్ణువును,॥

సూర్యుఁడు మాకుశుభమిచ్చుఁగాక. వరుణుఁడు మాకు శుభమిచ్చుఁగాక మాకు అర్యముఁడు శుభమిచ్చుఁగాక. ఇంద్రుండు బృహస్పతి మాకు శుభ మిత్తురుగాక. విశాలమైన పదములుగల విష్ణువుమాకు శుభమిచ్చుఁగాక.

నమోబ్రహ్మణో, నమస్తేవాయో, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి
త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మవాదిషం॥ ఋతమవాదిషం
సత్యమవాదిషం, తన్మామావీత్, తద్వక్తారమావీత్
ఆవీన్మాం ఆవీద్వక్తారం॥

బ్రహ్మమునకు నమస్కారము, ఓ వాయువానీకు నమస్కారము, నీవేప్రత్యక్ష మైన బ్రహ్మమవు, నిన్నే ప్రత్యక్షమైన బ్రహ్మమునుగాఁ బలికితిని. శాస్త్రవిహిత మైన దానిని బలికితిని త్రికరణ శుద్ధిగా సత్యమును బలికితిని, అది నన్ను రక్షించెను, అది వక్తను రక్షించెను. ననురక్షించెను వక్తను రక్షించెను.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఇతి

ద్వాదశో ఽనువాకః

శిక్షావల్లీ సమాప్తా

ఓమ్

అథ బ్రహ్మానందవల్లీ

ప్రథమోఽనువాకః

శాంతిమంత్రః

ఓమ్. స హ నావవతు, సహా నౌ భునక్తు సహవీర్యంకరవావహై
తేజస్వి నా వధీత మస్తు, మావిద్విషావహై

సూర్యుడు ప్రాణవృత్తికి పగటికి, వరుణుఁడు అపానవృత్తికి రాత్రికి అర్యముఁడు కంటికి, ఇంద్రుఁడు బలమునకు బృహస్పతి వాక్కునకు బుద్ధికి విష్ణువు పాదములకు అధిదేవతలు. వీరి ప్రార్థనచే సర్వశక్తులు గలుగునని భావము.

బ్రహ్మమునకు నమస్సులు; వాయువా నీకునమసు
నీవె ప్రత్యక్ష బ్రహ్మవు; నిన్నెప్రత్యక్ష బ్రహ్మ
మనితిని; యథావిధిగ వచించితిని; సత్యమాడినాను
అదియెనను వక్త బ్రోచుత మదెనన్ను వక్తఁ బ్రోచు॥

ఓం శాంతి శాంతి శాంతి

## ఇది
## పంద్రెండవయను వాకము,
## శిక్షావల్లి సమాప్తము.

## ఓం
## ఇంక బ్రహ్మానందవల్లి
## మొదటియను వాకము
## శాంతిమంత్రము

మమ్మికఁడేలుతన్ మముఁబెంచుఁగావుతన్
మేముతగు సామర్థ్య మెపుడొందుఁ గావుతన్
మేము చదివినదెల్ల మిగులఁదేజిల్లుతన్
మే మెపుడు నేద్వేష మెఱుఁగకయె యుండుతన్॥

(గురు శిష్యులమగు) మమ్మిద్దఱను (దేవుఁడు) రక్షించుఁగాక। మమ్మిద్దఱను గూడఁ బాలించుఁగాక. కలిసి మేమిద్దఱము (విద్యనుగూర్చిన) శక్తిని జేయుదుముగాక, మేము చదివినది తేజోవంతమగుఁగాక. మేము పరస్పరము ద్వేషించు కొనకుందుముగాక.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓం బ్రహ్మవిదాప్నోతిపరమ్। తదేషా అభ్యుక్తా।
సత్యం జ్ఞానమనంతంబ్రహ్మ। యోవేదనిహితం గుహాయాం।
పరమే వ్యోమన్ సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ
బ్రహ్మణా విపశ్చితా ఇతి।

బ్రహ్మమును తెలిసినవాడు సర్వోత్తమమైన బ్రహ్మమును పొందును. ఈ యర్థమందు ఋక్కు చెప్పబడినది. బ్రహ్మము సత్యస్వరూపమైనది. జ్ఞానరూపమైనది. అంతులేనిది. ఎవడు హృదయగుహయందు పరమాకాశమందును ఉన్న బ్రహ్మమును తెలిసికొనునో వాడు సర్వకామములను ఒక్కుమ్మడిగా సర్వజ్ఞుడైన బ్రహ్మముతోపాటు పొందును.

తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః
ఆకాశాద్వాయుః వాయోరగ్నిః అగ్నేరాపః
అద్భ్యః పృథివీ పృథివ్యా ఓషధయః
ఓషధీభ్యోఽన్నం అన్నాత్పురుషః సవా ఏషపురుషోఽన్న
రసమయః తస్యేదమేవ శిరః, అయం దక్షిణః పక్షః
అయం ఉత్తరః పక్షః। అయమాత్మా ఇదంపుచ్ఛం ప్రతిష్ఠా
తదప్యేష శ్లోకో భవతి॥

ఈ శాంతిమంత్రములో పరమేశ్వర ప్రార్థన, తాముచదివినవిద్య సార్థక
ముగా వలయునని కోరిక, విద్యచదువుటలోను విద్య చెప్పుటలోను పరస్పరము
సౌహార్దము కలిగియుండుటయుఁ గర్తవ్యములుగా బోధింపఁబడెను.

**ఓం శాంతి శాంతి శాంతి**

బ్రహ్మవేత్త బ్రహ్మముపొందు, వాక్కిది ఋక్కుచెప్పె
సత్యమైయనంతాత్మమై జ్ఞానమై బ్రహ్మమొప్పు
మహితమౌ నాకసమున హృద్గుహ బ్రహ్మఁదెలియుబుధుఁడు
జ్ఞాని బ్రహ్మతో నొకమారె సర్వకామంబులొందు

బ్రహ్మమును తెలిసినవాడు సర్వోత్కృష్ట బ్రహ్మమే అయిపోవునని
భావము. బ్రహ్మమనగా బృహద్రూపమై చైతన్యరూపమైనది.

అటువంటి యంతటి యాత్మస్వరూపంబు
గల బ్రహ్మనుండి ఆకాశమొదవె
ఆకాశముననుండి అనిలంబు జనియించె
ననిలంబు నందుండి యగ్నిపొడమె
అగ్నినుండి జలంబులావిర్భవంబులయ్యె
జలమునుండి పృథివి జననమొందె
ప్రథివియందుండి యోషధులు పుట్టెనునోష
ధులనుండి ఆహారములు జనియించె

అట్టి యాత్మనుండి ఆకాశము పుట్టెను. ఆకాశమునుండి గాలియు, గాలి నుండి నిప్పు నిప్పునుండి నీళ్లు నీళ్లనుండి నేల నేలనుండి ఓషధులు ఓషధుల నుండి ఆహారముదానినుండి పురుషుడు పుట్టెను. ఆ ఈ పురుషుడు అన్నరసముల స్వరూపమైనవాడు, ఆ పురుషుడనెడి పక్షికి శిరస్సు ఇదే. (మనకు కనుపించు శిరస్సే) ఈ కుడి భాగము కుడిరెక్క ఎడమభాగము ఎడమరెక్క. ఈమధ్య భాగము ఆత్మ ఆధారమైన ఈ నడుము క్రిందిభాగముతోక. ఇది ఈ అర్థమును చెప్పు శ్లోకము.

ఇతి

ప్రథమోఽనువాకః

## అథ

## ద్వితీయోఽనువాకః

అన్నాద్వై ప్రజాః ప్రజాయన్తే। యాః కాశ్చ పృథివీం శ్రితాః
అథో అన్నేనైవ జీవంతి, అథైనదపి యంత్యంతతః
అన్నంహి భూతానాం జ్యేష్ఠం తస్మాత్ సర్వౌషధ ముచ్యతే.
సర్వంవై తేఽన్నమాప్నువంతి అన్నం బ్రహ్మోపాసతే
అన్నంహి భూతానాం జ్యేష్ఠం తస్మాత్ సర్వౌషధ ముచ్యతే॥

అన్నమునుండియే భూమినాశ్రయించిన స్థావర జంగమరూపమైన జీవులు పుట్టుచున్నవి. మరి అన్నముచేతనే జీవించుచున్నవి. మఱి చివర అన్నమునే పొందుచున్నవి. అన్నమే భూతములలో మొదటిది. అందువలన అది సర్వౌషధ మని చెప్పబడుచున్నది. ఎవరు అన్నమును బ్రహ్మముగా ఉపాసింతురో వారు సమస్తములైన అన్నములను పొందుదురు. అన్నమే ప్రాణులలో మొదటిది. అందువలన అది సర్వౌషధమని చెప్పబడుచున్నది.

అన్నాద్భూతానిజాయంతే, జాతాన్యన్నేన వర్ధంతే
అద్యతేఽత్తి చ భూతాని, తస్మాదన్నంతదుచ్యతే, ఇతి

పురుష డాయన్నములఁ బుట్టెఁ, బురుషుడన్న
రసమయుం, డాపురుషపక్షికి శిరసిదయె
కుడిచెయ్యి కుడిరెక్క; ఎడమది ఎడమఱెక్క;
మధ్యమాత్మ" క్రిందిదితోక మంత్రమిద్ది.

ఈమంత్రములో పురుషుడు పక్షిగాపోల్చి వర్ణించబడెను.

ఇది
మొదటియను వాకము

ఇంక
రెండవఅనువాకము.

క్షితినాశ్రయించి జీవంబు లెల్లయు
నన్నంబునుండి యుత్పన్నమగును
అన్నంబుచేత నీయవియెల్ల జీవించు
నివియన్నమందె లయించుఁగడకు
అన్నమే మొదటిది యన్ని ప్రాణులయందు
అందుచే నదియె సర్వౌషధంబు
అన్నానఁ బుట్టితి నన్నరూపుండను
నన్నమునలయింతు" ననుచుమదిని॥

అన్నముఁ బరబ్రహ్మముగ నుపాసనంబు
చేయువారెల్ల యన్నముల్ చెందుచుంద్రు
అన్నమే మొదటిది యన్నిప్రాణులందు
అందుచేత సర్వౌషధ మనఁగబడును॥

అన్నంబుచేతనె ప్రాణులుపుట్టును
పుట్టి యన్నముచేతఁ బుష్టిచెందు

తస్మాద్వా ఏతస్మా దన్నరసమయాత్ అన్యోఽంతర
ఆత్మా ప్రాణమయః, తేనైష పూర్ణః, సవా ఏష పురుషవిధఏవ
తస్య పురుష విధతాం అన్వయం పురుషవిధః॥

అన్నమువల్ల ప్రాణులు పుట్టుచున్నవి. పుట్టిన ప్రాణులు అన్నముచే వర్ధిల్లుచున్నవి. తినఁబడును, ప్రాణులను తినునుగాన అది అన్నమని చెప్పఁబడును. అ యీయన్నరసమయమైన తిత్తికంటె ప్రాణమయమైన యాత్మ యితరమైనది. ప్రాణమయమైన తిత్తిచే ఈ యన్నమయపుఁదిత్తి నిండియున్నది. ఆ యీ ప్రాణమయకోశము పురుషాకృతిగలది. అన్నమయకోశముయొక్క పురుషాకారమును అనుసరించి ప్రాణమయకోశము గూడ పురుషాకారముగలది యగును.

తస్య ప్రాణఏవ శిరః వ్యానోదక్షిణః పక్షః అపాన ఉత్తరః పక్షః
ఆకాశ ఆత్మా పృథివీ పుచ్ఛం ప్రతిష్ఠా తదప్యేష శ్లోకోభవతి॥

ఆ ప్రాణమయ పక్షికి ప్రాణమేశిరస్సు, వ్యానవాయువు కుడిఱెక్క, అపానవాయువు, ఎడమఱెక్క, ఆకాశమందున సమానవాయువు ఆత్మ పృథివీదేవత రూపమైన యుదానవాయువు ప్రాణమయ పక్షికి ఆధారమైన తోక ఇది యీ యర్థమును జెప్పుశ్లోకముగా నున్నది.

ఇతి
ద్వితీయో ఽనువాకః

అథ

## తృతీయోఽనువాకః

ప్రాణందేవా అనుప్రాణంతి మనుష్యాః పశవశ్చయే
ప్రాణోహి భూతానామాయుః॥ తస్మాత్సర్వాయుష ముచ్యతే

ప్రాణిచేఁ దినఁబడుఁ బ్రాణులనుదినును
నందుచేనది యన్నమనఁగఁబడును
అన్నమయపుఁదిత్తి కంటెలోపలనున్న
ప్రాణమయంబైన యాత్మవేఱు
ప్రాణమయపుఁదిత్తి యన్నమయవుఁదిత్తి
నెల్లయెడలఁజుట్టి నిండియుండు
ప్రాణమయ కోశమది పురుషాకృతియగు
అన్నమయ కోశరూపంబు ననుసరించి
ప్రాణమయ కోశమునుగూడ నవ్విధముగ
పురుషునాకృతి గలదియై పొలుచుచుండు॥

అద్యతే=తినఁబడును, అత్తి=తినుచుగాన అన్నమని వ్యుత్పత్తి.

ప్రాణమయ కోశపక్షికిఁ బ్రాణమెతల
వ్యానము కుడిఱెక్క; యపానమగు నెడమది
ఆకోశముననున్న సమానమగును మధ్య
మహిమను నుదానమిదితోఁక మంత్రమిద్ది॥

ఇందు ప్రాణమయ పక్షికి ప్రాణాదులు తలమొదలగు నవయవములుగా వర్ణింపఁబడెను.

ఇది

రెండవ యనువాకము.

ఇంక

మూఁడవ యనువాకము.

ప్రాణమున్బట్టి దేవతలు మనుష్యులు
పశువులు సర్వంబు బ్రదుకుచుండు

సర్వమేవ త ఆయుర్యంతి, యే|ప్రాణం |బహ్మోపాసతే
|ప్రాణోహి భూతానామాయుః తస్మాత్సర్వాయుష ముచ్యతే ఇతి
తస్యైష ఏవ శారీర ఆత్మాయః పూర్వస్య; తస్మాద్వా
ఏతస్మాత్ప్రాణ మయాత్, అన్యోఽంతర ఆత్మా
మనోమయః తేనైష పూర్ణః॥

|ప్రాణమును అనుసరించి అగ్న్యాది దేవతలు ఇం|ద్రియములు మనుష్యులు పశువులు జీవించుచున్నవి. |ప్రాణమె |ప్రాణులకు జీవనము కనుక అది సర్వాయుషమని చెప్పఁబడుచున్నది. ఎవరు |ప్రాణమును |బహ్మముగా ఉపాసింతురో వారు పూర్ణాయువును పొందెదరు. |ప్రాణమె |ప్రాణులకు జీవనము, కనుక అది సర్వాయుషమని చెప్పఁబడుచున్నది. ఆ యన్నమయమగు శరీరమునకు ఈ శరీరమందలి |ప్రాణమెయాత్మ. ఆ |ప్రాణమయమైన యాత్మకంటె మనోమయమగు నీయాత్మ యితరమైనది. ఈ మనోమయమైన యాత్మ ఈ |ప్రాణమయమైన యాత్మచేత నిండియున్నది.

సవా ఏష పురుషవిధఏవ, తన్యపురుషవిధతాం
అన్వయం పురుషవిధః॥

ఆ మనోమయము పురుషాకారము గలది. అన్నమయకోశము ననుసరించి ఆ మనోమయ కోశమును పురుషాకారముగలదె.

తస్యయజురేవశిరః ఋుగ్దక్షిణః పక్షః, సామోత్తరః పక్షః
ఆదేశ ఆత్మా. అథర్వాంగిరసః పుచ్ఛం |ప్రతిష్ఠా, తదప్యేష శ్లోకోభవతి॥

ఆమనోమయ పక్షికి (మనస్సునందు స్థాన |ప్రయత్నాలద్వారా వ్యక్తమగు నాదరూపమైన) యజుస్సె శిరస్సు, సామవేదము కుడిఱెక్క, ఆదేశరూప |బాహ్మణ |గంథము ఆత్మయగుమధ్యము అథర్వునిచే అంగిరసునిచే దృష్టమగు అథర్వవేదము ఆధారమైనతోక, ఇది యీ యర్థమును జెప్పుశ్లోకము.

ఇతి

తృతీయోఽనువాకః

ప్రాణంబె ప్రాణుల కాయువుగావున
నదియె సర్వాయుష మనఁగఁబడియె
"ఆ ప్రాణమను నేను ప్రాణులకాయువ"
నని ప్రాణమును బ్రహ్మమనుచు మదిని
నెపుడుపాసించు వారిలశతాయువుఁగాంత్రు
ప్రాణంబె ప్రాణుల కాయువగును॥

అందుచేత సర్వాయుష మనఁగఁబడియె
అన్నమయ కోశమ నకాత్మ ప్రాణమయమె
ప్రాణమయ కోశమున వేఱెయగు మనోమ
యంబు; దీనిచే మనోమయంబు నిండె॥

ఆమనోమయమది పురుషాకృతియగు
నన్నమయ కోశరూపంబు ననుసరించి
ఆమనోమయ కోశంబు నవ్విధమునఁ
బురుషునాకృతి గలదియై పొలుచుచుండు॥

"ఆమనోమయ పక్షికి యజుసె శిరసు
ఋక్కె కుడిఱెక్క, సామంబె యెడమఱెక్క
బ్రాహ్మణమె మధ్య మాయథర్వాఖ్యవేద
మాశ్రయమగుతోక నిదియుమంత్ర సూక్తి॥

మనస్సునందు బాహ్యప్రయత్న స్థానములందు నాదాక్షర రూపముగ వ్యక్తమైన యజుర్వేదాదులు దానికి పక్షాదులని భావము.

ఇది

మూఁడవ యనువాకము

## అథ

## చతుర్థోఽనువాకః

యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ
ఆనందం బ్రాహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన॥

ఎందుండి వాక్కులు మనస్సుతోఁ గూడ దానిని జేరలేక వెనుకకు మరలిపోవుచున్నవో యట్టి యానందరూప బ్రహ్మమును దెలిసిన బ్రాహ్మణుఁడు ఎప్పుడును భయము పొందఁడు.

తస్యైష ఏవ శరీర ఆత్మా, యః పూర్వస్య; తస్మాద్వా
ఏతస్మాన్మనోమయాత్ అన్యోఽంతర ఆత్మా విజ్ఞానమయః తేనైష పూర్ణః॥

పూర్వమైన యా ప్రాణమయ కోశమునకు శరీరమందలి యీ మనోమయ కోశమె ఆత్మ ఆ యీ మనోమయకోశముకంటె అందులోపలనున్న విజ్ఞానమయ కోశము ఇతరమైనది, అవిజ్ఞానమయకోశము ఇతరమైనది. ఆవిజ్ఞానమయకోశముచేత మనోమయకోశము నిండి యుండెను.

సవా ఏష పురుషవిధ ఏవ తస్యపురుష విధతాం
అన్వయం పురుష విధః

ఆవిజ్ఞానమయకోశము పురుషాకారముగలది, అన్నమయకోశము ననుసరించి యావిజ్ఞానమయ కోశమును పురుషాకారముగలదే.

తస్య శ్రద్ధైవశిరః, ఋతం దక్షిణః పక్షః, సత్యముత్తరః పక్షః.
యోగ ఆత్మా, మహః పుచ్ఛం ప్రతిష్ఠా, తదప్యేష శ్లోకో భవతి॥

ఆ విజ్ఞానమయకోశ మనెడు పక్షికి శ్రద్ధయె శిరస్సు, ఆచరణము కుడిరెక్క, సత్యము ఎడమరెక్క, నిశ్చలసమాధి మధ్యము మహత్తత్వము ఆధారమైనతోక, ఇది యీ యర్థమునుజెప్పు శ్లోకము.

ఇతి

చతుర్థోఽనువాకః

ఇంకే

## నాల్గవ యనువాకము.

వాక్కులు మనస్సుతోడనే బ్రహ్మపదము
చేరియఁజాలక వెనుకకు మరలిపోవు
నట్టి యవ్యయంబైన యానందమెఱుఁగు
బ్రాహ్మణుఁడెపుడు నెచ్చోట భయముగనఁడు॥

ప్రాణమయ కోశమునకాత్మ ఆమనోమ
యమ్ము; మనోమయ కోశంబునందు వేఱె
యలరు విజ్ఞానమయ కోశమనెడు పేర;
నట్టి దానిచేత మనోమయంబు నిండె॥

వఱలు విజ్ఞానమయ కోశంబు పురుషునట్లు
అన్నమయ కోశరూపంబు ననుసరించి
అట్ల విజ్ఞానమయ కోశమవ్విధమున
పురుష నాకృతిగలదియై పొలుచుచుండు॥

ప్రకటు విజ్ఞాన పక్షికి శ్రద్ధశిరసు
ఆచరణ కుడిఱెక్క సత్య మెడమదగు
నిశ్చలసమాధి మధ్యము నెఱయు; మొదటి
మహాతు తత్త్వముతోఁకయౌ, మంత్రమిద్ది॥

ఇది

నాల్గవ యనువాకము

## అథ

## పంచమోఽనువాకః

విజ్ఞానం యజ్ఞంతనుతే, కర్మాణితనుతేఽపిచ
విజ్ఞానందేవాః సర్వే, బ్రహ్మజ్యేష్ఠముపాసతే, విజ్ఞానం బ్రహ్మచేద్వేద
తస్మాచ్చేన్న ప్రమాద్యతి శరీరేపాప్మపనోహిత్వా సర్వాన్‌కామాన్ సమశ్నుతఇతి

విజ్ఞానవంతుడు యజ్ఞమును కర్మలనుగూడఁజేయును, సర్వదేవతలు మొదటిదైన విజ్ఞానరూపమైన బ్రహ్మమును ఉపాసింతురు. విజ్ఞానరూపమైన బ్రహ్మమును దెలిసికొన్నచో ఆ బ్రహ్మోపాసననుండి ప్రమాదపడనిచో ఈ శరీరమున పాపములనువీడి సర్వకామములను బొందును.

తస్యైష ఏవ శారీర ఆత్మా, యః పూర్వస్య; తస్మాద్వా
ఏతస్మాద్విజ్ఞానమయాత్ అన్యోఽంతర ఆత్మానందమయః తేనైషపూర్ణః

ఆమనోమయ కోశమునకు ఈ శరీరమందలి విజ్ఞానయకోశమే ఆత్మ. ఆ యీ విజ్ఞానమయ కోశముకంటె దానిలోని ఆనందమయకోశము వేఱైనది. ఆనందమయకోశముచే విజ్ఞానమయ కోశము నిండియున్నది.

సవాఏష పురుషవిథ ఏవ తస్య పురుషవిధతాం
అన్వయం పురుషవిథః

ఆయానందమయకోశము పురుషాకారము గలది. అన్నమయకోశము ననుసరించి యానందమయకోశమును పురుషాకారము గలదే.

తస్యప్రియమేవ శిరః, మోదోదక్షిణః పక్షః, ప్రమోద ఉత్తరః పక్షః
ఆనంద ఆత్మా బ్రహ్మ పుచ్ఛంప్రతిష్ఠా, తదప్యేష శ్లోకోభవతి॥

ఆనందమయపక్షికి ప్రియమె శిరస్సు, మోదము కుడిఱెక్క ప్రకృష్ట మోదము ఎడమఱెక్క, ఆనందమె మధ్యభాగము ఆధారమైనదితోక. ఇది యీ యర్థమును జెప్పుశ్లోకము.

ఇతి

పంచమోఽనువాకః

ఇంక

## అయిదవయనువాకము.

యజ్ఞములఁజేసి విజ్ఞానియలరుఁ గర్మలనుజేయు;
ప్రథమ విజ్ఞాన బ్రహ్మనుపాసింత్రు దేవులెల్ల
బ్రహ్మముగను విజ్ఞానముఁపాసించుచో నటఁబొర
పడనిచోమేనఁ బాపముల్ విడికోర్కెలెల్లఁ బొందు॥

దేవులనఁగా నింద్రియములు ఇంద్రాది దేవతలును అని గ్రహింప వలయును.

కన మనోమయమునకు విజ్ఞానమయమె
యాత్మ; విజ్ఞానమయ కోశమందు వేఱె
యలరు నానందమయ కోశమనెడు పేర;
మఱియుదానిచే విజ్ఞానమయము నిండె॥

వఱలు నానందమయ కోశంబు పురుషునట్లు
అన్నమయ కోశరూపంబు ననుసరించి
యల్ల యానందమయ కోశమవ్విధమున
పురుషునాకృతి గలదియై పొలుచుచుండు॥

వెలయు నానందపక్షికిఁ బ్రియమెశిరసు
మోదము కుడిఱెక్క ప్రమోదమొప్పు నెడమ
దింక నానందమే మధ్య దేహమగును
మఱియు బ్రహ్మంబుతోకయౌ మంత్రమిద్ది॥

ఇది

అయిదవ యనువాకము

## అథ

## షష్ఠో ఒనువాకః

అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేదచేత్
అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదురితి
తస్యైష ఏవ శారీర ఆత్మా యః పూర్వస్య॥

బ్రహ్మములేదని తెలిసినచో వాఁడు అసన్మార్గుఁడే యగును, బ్రహ్మము గలదని తెలిసినచో వీనిని సన్మారుఁడని యందురు, ఆ విజ్ఞానమయ కోశమునకుఁ బూర్వము చెప్పినదానికే యానందమయమెఆత్మ.

అథాతోఒనుప్రశ్నాః, ఉతావిద్వానముం లోకంప్రేత్య
కశ్చన గచ్ఛతీ౩; ఆహో విద్వానముం లోకంపేత్య, కశ్చిత్సమనుశ్నుతా ౩ ఉ॥

మఱి యింక గురువును గుఱించి శిష్యుఁడడిగిన ప్రశ్నలు చెప్పఁబడును ఆ విద్వాంసుఁడుగూడ ఈ లోకమును విడిచి బ్రహ్మమును బొందునా? పొందఁడా! లేక విద్వాసుఁడె ఈ లోకమునువిడిచి బ్రహ్మమును పొందునా లేక విద్వాంసుఁడు గూడఁ బొందఁడా!

సోఒకామయత బహుస్యాం, ప్రజా యే యేతి
సతపో ఒతప్యత, సతప స్తప్త్వా, ఇదం సర్వమసృజత
యదిదం కించ, తత్సృష్ట్వా తదేవాను ప్రావిశత్
తదనుప్ర విశ్య సచ్చత్యచ్చాఒభవాత్, నిరు క్తంచ
నిలయనం చానిలయంచ విజ్ఞానం చావిజ్ఞానంచ
సత్యం చానృతంచ, సత్యా మభవత్, యదిదంకించ
తత్సత్య మిత్యాచక్షతే, తదప్యేషశ్లోకో భవతి॥

"బహురూపములుగల వాఁడనగుదును ప్రజలనుసృజింతు" అని యతఁడు కోరెను. అతఁడు ధ్యానముచేసెను అతఁడు ధ్యానముచేసి ఈ ప్రపంచములో ఏదైతే ఉన్నదో దీనినంతను సృజించెను, దానినిసృజించి దానినే ప్రవేశించెను. దానిని ప్రవేశించి రూపముగల వస్తువును రూపములేని వస్తువు అయ్యెను. ఇట్టిదని చెప్పఁదగినది ఇట్టిదని చెప్పరానిదియు ఆశ్రయమైనది ఆశ్రయము

## ౨౦౪

### ౧౬వ యనువాకము.

బ్రహ్మమది లేదనితెలియువాఁ డసత్పురుషుఁడగును
బ్రహ్మము గలదని తెలియుహాని సత్పురుషుఁడంద్రు
భువిని విజ్ఞానమయ కోశమునకెల్ల యపుడుగూడ
నమలమానందమయకోశ మాత్మయై పొలుచుచుండు॥

బ్రహ్మము బాహ్య వ్యవహారమునకు అతీతమై యుండుటవల్ల నాస్తికులైన మూర్ఖులకదిలేదను బుద్ధిగలుగునని భావము.

శిష్యుఁడడిగిన ప్రశ్నలు చెప్పఁగాబడును నింక
అవనివిడి మూఢుఁడును బ్రహ్మమరయునె లేకగనఁడ
ఇలనువీడి బ్రహ్మమును దర్శించునె జ్ఞానియొకఁడె
లేకయట్టి బ్రహ్మమును దర్శింపఁడో జ్ఞానికూడ॥

బ్రహ్మమునకు పక్షపాతము ఉండదుగాన అజ్ఞాని జ్ఞానియను భేదము లేకుండ అందఱకు అది దొరకునా అనిప్రశ్న యభిప్రాయము.

"బహురూపములఁగాంతుఁ బ్రజస్సృజింతు" ననిబ్ర
హ్మముకోరెఁగోరి ధ్యానంబుచేసె
అట్లుధ్యానముచేసి యందిందు నున్నట్టి
యీ సమస్తంబును సృష్టిచేసె
అట్లు సృష్టినిజేసి యందెబ్రహ్మము ప్రవే
శించె; నట్లులు ప్రవేశించియందు
మూర్తమును నమూర్తమును నయ్యె; నిట్టి ద
న్నదియు, నిట్టిదనన్ రానిదయ్యె
సాశ్రయంబు నయ్యె నిరాశ్రయంబు నయ్యె
జడముఁ జేతనమును నయ్యె; సత్య మన్నృత
మయ్యెఁ; బరమార్థ సత్యంబునయ్యె, సర్వ
మయ్యె, సత్యమందురుదీని; మంత్ర మిద్ధ

లేనిదియు, చేతనముజడము సత్యము (=ఆపేక్షికసత్యము) అసత్యము, పరమార్థ సత్యము అయ్యెను. ఈ సర్వప్రపంచమయ్యెను, కనుక ఆ బ్రహ్మము (=సద్రూపము) అందురు, బ్రహ్మము లేదనువారికి సమాధానముగా ఈ బ్రహ్మకార్యములన్నియుఁ జెప్పఁబడెను. ఈ యర్థమునుజెప్పు శ్లోకమిది.

ఇతి

షష్ఠోఽనువాకః

అథ

## సప్తమో అనువాకః

అసద్వా ఇదమగ్ర ఆసీత్, తతోవైస దజాయత ఒదాత్మానం
స్వయమకురుత, తస్మాత్తత్సుకృత ముచ్యత ఇతి
యద్వైతత్సుకృతం, రసోవైస, రసంహ్యేవాయం
లబ్ధ్వాఽఽనందీభవతి, కోహ్యేవాన్యాత్ (అన్యాత్=అపానకర్మకుర్యాత్)
కఃప్రాణ్యాత్ యదేష ఆకాశ ఆనందోనస్యాత్ ఏషహ్యేవానందయాతి॥

ఈ బ్రహ్మము మొదట నామరూపాదులులేనిదై యుండెను. దాని నుండియే నామరూపాదులుగల యీ ప్రపంచముపుట్టెను. నామరూపాదులులేని యాబ్రహ్మమే స్వయముగఁ జేసెను. కనుక అది తనకుఁదాను జేసికొనెను గాన సుకృతమని చెప్పఁబడుచున్నది. అతఁడు రస (=ఆనంద) స్వరూపుఁడు. ఇతఁడు రసమునెపొంది ఆనందముగలవాఁడగును, ఇతఁడు ఆకాశరూప హృదయమగు ఆనంతస్వరూపుఁడై యుండకున్న నింకెవఁడు అపానకర్మను ప్రాణకర్మనుజేయును, ఇతఁడె ఆనందపెట్టును.

యదా హ్యేవైష ఏతస్మిన్నదృశ్యేఽనాత్మ్యేఽనిరుక్తే
అనిలయనే అభయం ప్రతిష్ఠాం విందతే అథసోఽభయంగతో భవతి॥

ఎప్పుడైతే ఈ సాధకుఁడు కనిపింపని మాఱని, యిట్టిదనరాని ఆశ్రయములేని యీ బ్రహ్మమందు భయరహితమైన ఆత్మస్వరూపమును బొందునో అప్పు డతఁడు అభయమును బొందినవాఁడగును.

బ్రహ్మము లేదన్నవారికి సమాధానముగా బ్రహ్మకార్యమగు సృష్టి యంతయుఁజెప్పి బ్రహ్మమున్నదని యిందు నిరూపింపబడెను. "సత్య మమృత మయ్యె" అనుచోట సత్యమనఁగా ఆపేక్షికము వ్యావహారికమునగు సత్య స్వరూపము చెప్పఁబడినది.

ఇది

ఆరవఅనువాకము

**ఇంక**

**ఏడవయనువాకము**

ఆదిలో నామరూపాదులు లేని య
వ్యాకృత బ్రహ్మమై యఖిలముండె
అవ్యాకృతమగు బ్రహ్మమునుండి నామ రూ
పాదులుగల యీ ప్రపంచ మొదవె
అవ్యాకృతమగు బ్రహ్మము తన్ను స్వయముగ
నీ ప్రపంచముగఁ గావించుకొనియె
తనకుఁ దాఁగ ర్తయౌటను బుణ్యుఁడౌటను
నాబ్రహ్మము సుకృతంబనఁగఁబడియె।

ఆతఁడు రస స్వరూపుఁడౌ; నతఁడు రసము
ననుభవించి యానందించు; నతఁడు హృదయ
గుహను నానందమై యుండకున్న నెట్లు
నడచుఁ బ్రాణము; లితఁడె యానందపెట్టు.

వ్యాకృతము=నామరూపాలుగలది, అవ్యాకృతము=నామరూపాదులులేనిది

తనువులేని మాటని యిట్టిదనఁగరాని
యాశ్రయములేని యా బ్రహ్మమందు నభయ

యదా హ్యేవైష ఏతస్మి న్నుదర (ఉత్ + అరమ్) మంతరం
కురుతే; అథతస్య భయం భవతి, త త్త్వేవ (తత్తు + ఏవ) భయం
విదుషోఽమన్వానస్య, తదప్యేష శ్లోకో భవతి॥

ఎప్పుడైతే ఈ సాధకుఁడు ఈ బ్రహ్మమందు స్వల్పమైన ఛిద్రమును (ఉత్ + అరం) జేయునో మఱి వానికి భయము కలుగును. ఒకటిగాఁదలఁపని పండితం మన్యునికి ఆబ్రహ్మమే భయమగును. ఈ యర్థమును జెప్పు శ్లోకమిది.

ఇతి

సప్తమోఽనువాకః

అథ

## అష్టమో ఽనువాకః

భీషాఽస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః
భీషాఽస్మాదగ్నిశ్చేంద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమ ఇతి॥

భయముచే ఈ బ్రహ్మమునుండి గాలివీచును. భయముచే సూర్యుఁడుదయించును. భయముచే దీనినుండి యగ్నియు నింద్రుఁడును పనిచేయుదురు. అయిదవదైన మృత్యుదేవత తనపనిచేయఁబరువెత్తును.

సైషాఽఽనందస్య మీమాంసా భవతి, యువాస్యాత్సాధుయువా
అధ్యాయకః, ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః తస్యేయం పృథివీ సర్వా
విత్తస్యపూర్ణాస్యాత్, స ఏకో మానుష ఆనందః॥

ఇపుడు ఇది యానందముయొక్క మీమాంస చెప్పఁబడుచున్నది మనుజుఁడు యువకుఁడై సాధువయి చదుకొన్నవాఁడై చురుకైనవాఁడై దార్ఢ్యముగలవాఁడై బలవంతుఁడైయుండి వానికీ సమస్తభూమియుండి యా భూమి ధనములతో నిండియున్నచో అట్టివానికిఁ గలిగెడి యానందము ఒక మానుషానంద మనఁబడును.

మైన యాత్మస్వరూపము నందు నెపుడు
సాధకుఁ డభయమొందును సంతతంబు॥

ఇట్టి బ్రహ్మమునెడ నల్పమేని భేద
దృష్టి నుంచ సాధకుఁడు భీతిల్లు మిగుల
తానునదియునొక్కఁటెయని తలఁపలేని
జ్ఞానికదె బ్రహ్మ భయమౌను మంత్రమిద్ది॥

ఇది

## ఏడవ యను వాకము.

ఇంక

## ఎనిమిదవయను వాకము

అతనివలన భీతిలి గాలి క్షితినివీచు
అతనివలన భీతిలి సూర్యుఁడవని వెలుఁగు
అతనివలన భీతిలి యింద్రుఁడగ్ని నడతు
రతనివలన భీతిలి మృత్యువది చరించు॥

ఇంక నానంద మీమాంసయిపుడిదె చేయఁబడును
యువకుఁడిట సాధుయువకుఁడై యుక్తాధ్యయనము చేసి
ఘనుఁడయి దృఢుఁడై శక్తుఁడై ధనపూర్ణ భువిఁబ్రభువయి
పడయు నానందమొక మానుషానంద మనఁగబడును

ఆనందస్వరూపుఁడైన బ్రహ్మమును బొందవలయునుగాన జీవులలో నేయేవిధము లైన యానందములు గలవో యెట్టియానందము గొప్పదో యేయానందమును బొంది బ్రహ్మస్వరూపమును బొందవలయునో తెలుపుట కానందమీమాంస చేయ యబడుచున్నది.

తేయేశతం మానుషా ఆనందా స ఏ కోమనుష్యగంధర్వాణా
మానందః, శ్రోత్రియస్య చాఽకామహతస్య॥

అట్టి మనుష్యా నందములు నూఱైనచో అవినూఱు గలిసి మనుష్య గంధర్వులకు (=మనుష్యులై పుట్టి పుణ్యముచే గంధర్వులైన వారికి) ఒకయానందమగును. అది కామములచే హతుడుగాని శ్రోత్రియునికినికలుగును.

తేయే శతం మనుష్యగంధర్వాణామానందాః స ఏకో
దేవగంధర్వాణామానందాః శ్రోత్రియస్యచాఽకామహతస్య॥

అట్టి మనుష్యగంధర్వుల యానందములు నూఱైనచో అవినూఱుకలిసి సహజముగనున్న దేవగంధర్వులకును ఒకయానందమగును. అది కామములచేత హతుఁడుగాని శ్రోత్రియునికిని కలుగును.

తేయే శతందేవ గంధర్వాణామానందాః స ఏకః పిత్ౄణాం
చిరలోక లోకానామానందః శ్రోత్రియస్య చా కామతస్య॥

అట్టి దేవగంధర్వుల యానందములు నూఱైనచో అవి నూరుగలిసి సహజముగనున్న దేవగంధర్వులకు ఒక యానందమగును. అది కామములచేత హతుఁడుగాని శ్రోత్రియునికిని కలుగును.

తేయే శతం పిత్ౄణాం చిరలోక లోకానా మానందా
స ఏక ఆజానజానాందేవానామానందః శ్రోత్రియస్యచా కామహతస్య॥

అట్టి చిరస్థాయియగు లోకమునందున్న పితృదేవుల యానందములు నూఱైనచో అవినూఱుగలిసి ఆజానజులను దేవులకు ఒక యానందమగును. అది దేవతలకు కామములచేత హతుఁడుగాని శ్రోత్రియునికిని కలుగును.

తేయే శత మాజానజానాందేవానామానందాః, స ఏకః కర్మదేవానాం
దేవానామానందః యే కర్మణా దేవా నపియంతి, శ్రోత్రియస్యచాకామహతస్య

అట్టి ఆజానలోకమందున్న దేవతలయానందములు నూఱైన అవినూఱుకలిపి వైదికకర్మచే దేవతలను బొందిన కర్మదేవులనే దేవతలకు ఒక యానందమగును అది కామములచేత హతుఁడుగాని శ్రోత్రియునికిని కలుగును.

తేయే శతం కర్మదేవానాం దేవానామానందాః స ఏకో దేవానా
మానందః శ్రోత్రియస్య చాకామతస్య॥

అట్టి మానుషానందములు నూఱైన యొకటి
కేవలమ్మొక్క యానందమై విరాజిల్లుచుండు
మానవులయి గంధర్వులైనా మనుజగంధర్వులకును
కామములచేత నిహతుడుగానట్టి శ్రోత్రియునికి.

అట్టి మనుజగంధర్వుల యానందములును నూఱు
కేవలమ్మొక్క యానందమై విరాజిల్లుచుండు
దివ్యులై సాజముగనున్న దేవగంధర్వులకును
కామములచేత నిహతుడు గానట్టి శ్రోత్రియునికి.

అట్టి దేవగంధర్వుల యానందములును నూఱు
కేవలమ్మొక్క యానందమై విరాజిల్లుచుండు
అచిరస్థాయిలోకాల నగు పితృదేవతలకు
కామములచేత నిహతుడుగానట్టి శ్రోత్రియునికి॥

అట్టి పితృదేవతలైన యానందములును నూఱు
కేవలమ్మొక్క యానందమై విరాజిల్లుచుండు
అవల నాజానమనులోకమందున్న దేవులకును
కామములచేత నిహతుడుగానట్టి శ్రోత్రియునికి.

స్మృత్యుక్త కర్మవిశేషమువల్ల [illegible]
దేవతలు.

అట్టియాజాన దేవులయానందములును నూఱు
కేవలమ్మొక్క యానందమై విరాజిల్లుచుండు
అవిహిత కర్మచే గర్మదేవులౌ దేవతలకు
కామములచేత నిహతుడుగానట్టి శ్రోత్రియునికి.

వైదిక కర్మలు చేయుటవలన దేవత్వము [illegible]

అట్టి కర్మదేవులకుగల్గు నానందములును నూఱు
కేవలమ్మొక్క యానందమై విరాజిల్లుచుండు

అట్టి కర్మదేవుల యానందములు నూటైనచో అవి నూటికలిసి దేవతలకు అది కామములచే హతుఁడుగాని శ్రోత్రియునికిని కలుగును ఒక యానందమగును.

తేయే శతం దేవానామానందాః స ఏక ఇంద్ర
స్యానందః శ్రోత్రియస్య చాకామహతస్య॥

అట్టి దేవుల యానందములు నూటైనచో అవి నూటికలిసి దేవపతి యింద్రునికి ఒక యానందమగును అది కామములచే హతుఁడుగాని శ్రోత్రియునికిని కలుగును.

తేయే శతమింద్ర స్యానందాః స ఏకో బృహస్పతే రానందః
శ్రోత్రియస్యా చాకామహతస్య

అట్టి ఇంద్రుని యానందములు నూరైనచో అవి నూటికలిసి దేవగురువగు బృహస్పతికి ఒక యానందమగును అది కామములచేత హతుఁడుగాని శ్రోత్రియునికిని కలుగును.

తేయే శతం బృహస్పతే రానందాః స ఏకః
ప్రజాపతే రానందః శ్రోత్రియస్య చాకామహతస్య॥

అట్టి బృహస్పతి యానందములు నూరైనచో అవి నూటికలిసి సృష్టికర్తయైన ప్రజాపతికి ఒక యానందమగును అది కామములచేత హతుఁడుగాని శ్రోత్రియునికిని కలుగును.

తేయే శతం ప్రజాపతే రానందాః స ఏకో
బ్రహ్మణ ఆనందః శ్రోత్రియస్య చాకామహతస్య

అట్టి ప్రజాపతి యానందములు నూరైనచో అవి నూటికలిసి బ్రహ్మకు ఒక యానందమగును అది కామములచేత హతుఁడుగాని శ్రోత్రియునికిని కలుగును.

సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే సఏకః, సయఏవంవిత్
అస్మాల్లోకాత్ప్రేత్య ఏతమన్నమయమాత్మాన ముపసంక్రామతి
ఏతంప్రాణమయ మాత్మాన ముపసంక్రామతి ఏతం మనోమయ మాత్మానం

హవిసె భుజియించు ముప్పదిమువ్వురైన దేవతలకు
కామములచేతనిహతుడుగానట్టి శ్రోత్రియునికి॥

ఆహవిర్భుజుల్ దేవుల యానందములును నూఱు
కేవలమ్మొక్క యానందమై విరాజిల్లుచుండు
అఖిలదేవతలకుఁ బ్రభువైనట్టి యింద్రునకును
కామములచేత నిహతుఁడుగానట్టి శ్రోత్రియునికి॥

అట్టి సురపతి యింద్రుని యానందములును నూఱు
కేవలమ్మొక్క యానందమై విరాజిల్లుచుండు
అఖిలసురపతి కాచార్యుఁడైన బృహస్పతికిని
కామములచేత నిహతుఁడుగానట్టి శ్రోత్రియునికి॥

ఆ సురగురు బృహస్పతి యానందములును నూఱు
కేవలమొక్క యానందమై విరాజిల్లుచుండు
అఖిలజగముల సృజియించునట్టి ప్రజాపతికిని
కామములచేత నిహతుఁడుగానట్టి శ్రోత్రియునికి॥

అట్టి స్రష్టప్రజాపతి యానందములును నూఱు
కేవలమొక్క యానందమై విరాజిల్లుచుండు
ఘనుఁడు సర్వమైన హిరణ్యగర్భుఁడౌ బ్రహ్మమునకు
కామములచేత నిహతుఁడుగానట్టి శ్రోత్రియునికి॥

పురుషహృదిఁగలది రవిమండల మధ్యగలది బ్రహ్మ
మొకటి; యిటుగాంచువాఁడటఁబోయి యన్నమయమాత్మఁ

ముపసంక్రామతి ఏతం విజ్ఞానమయ మాత్మాన ముపసంక్రామతి
ఏతమానందమయ మాత్మన ముపసంక్రామతి, తదప్యేషశ్లోకో భవతి॥

పురుషునియం దేబ్రహ్మము గలదో సూర్యునియందేబ్రహ్మము గలదో అదియొక్కటే. దీనినిట్లు దెలిసినవాడు ఈ లోకమునుండిపోయి ఈ యన్నమయమందున్న యాత్మను బొందును ప్రాణమయ మనోమయ విజ్ఞానమయానందమయాత్మలను బొందును.

ఇతి

అష్టమో ఽనువాకః

అథ

## నవమో ఽనువాకః

యతోవా చో నివర్తంతే అప్రాప్యమనసా సహ
ఆనందం బ్రహ్మణో విద్వాన్ నబిభేతి కుతశ్చన ఇతి

ఎందుండి వాక్కులు మనసస్సుతోఁగూడ దానిని జేరలేక వెనుకకు మరలిపోవుచున్నవో యట్టి యానందరూప బ్రహ్మమును దెలిసిన బ్రాహ్మణుఁ డెప్పుడు భయముపొందఁడు.

ఏతం హ వావ న తపతి, కిమహం సాధు నాఽకరవమ
కి మహం పాప మకరవ మితి॥

"ఎందుకునేను మంచిపని చేయకపోతిని, ఎందుకునేను పాపముచేసితిని" అను దుఃఖములు ఇట్టి బ్రహ్మవేత్తను బాధింపలేవు

స య ఏవం విద్వానేతే ఆత్మానంస్పృణుతే, ఉభే హ్యేవైష ఏతే
ఆత్మానంస్పృణుతే య ఏవం వేద, ఇత్యుపనిషత్॥

బొందుఁ బ్రాణమయాత్మనుబొందు, విజ్ఞానమయముఁ
బొందు నానందమయాత్మఁ బొందును మంత్రమిద్ది॥

ఇందు శిష్యుఁడడిగిన ఆరవయనువాకములోని ప్రశ్నలకు సమాధానము చెప్పఁబడినది. అన్నమయము మొదలు ఆనందమయము వఱకుఁగల కోశములను దెలిసికొన్నవాఁడేగాని మూర్ఖుఁడు బ్రహ్మమును దెలిసికొనలేఁడని భావము.

ఇది

## ఎనిమిదవ యనువాకము

ఇంక

## తొమ్మిదవయనువాకము.

వాక్కులు మనస్సుతోడనే బ్రహ్మపదము
దరియఁజాలక వెనుకకు మరలిపోవు
నట్టియవ్యయంబై యానంద మెఱుఁగు
బ్రాహ్మణుఁడెపుడు నెచ్చోట భయముగనఁడు॥

మంచిపనియేల చేయక మసలినాఁడ
నేలపాపినై తిని మృత్యువేళ
కలుగుజడుని పశ్చాత్తాపములు ధరిత్రి
నట్టిబ్రహ్మవేత్తకు వ్యథ నిడఁగలేవు॥

ఇటుల మంచిచెడ్డల నెఱుఁగువాఁడు
ఆత్మమును తృప్తిపఱచు; నియ్యదియెఱుంగు

ఈ మంచిచెడ్డలను దెలిసినవాఁడు ఆత్మను సంతృప్తిపఱచును. ఈ యద్వైతమగు నానందబ్రహ్మమును దెలిసినవాఁడు ఈ మంచిచెడ్డలను ఆత్మ స్వరూపముగ సంతృప్తిపఱచును. ఇది బ్రహ్మవిద్యను దెలుపు ఉపనిషత్తు.

ఇతి
నవమోఽనువాకః
బ్రహ్మానందవల్లీ సమాప్తా

అథ

# భృగువల్లీ

## ప్రథమోఽనువాకః

భృగుర్వై వారుణిః వరుణం పితర ముపససార
అధీహి భగవో బ్రహ్మేతి, తస్మా ఏతత్ ప్రోవాచ, అన్నంప్రాణం
చక్షుః శ్రోత్రం మనోవాచమితి. తంహోవాచ, యతోవా
ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి
యత్ ప్రయం త్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ
తద్బ్రహ్మేతి, సతపోఽతప్యత, సతప స్తప్త్వా॥

వరుణుని కుమారుఁడైన భృగువు తండ్రియైన వరుణుని "ఓ భగవంతుఁడా? బ్రహ్మమును దెలుపుము" అని సమీపించెను. "అన్నము (=అన్నమున కాశ్రయమైన శరీరము) ప్రాణము కన్ను చెవి మనస్సు నాకు ఇవి బ్రహ్మమును దెలిసికొను ద్వారములు" అనిచెప్పెను. "ఎందునుండి యీ భూతములు పుట్టుచున్నవో పుట్టినవి దేనిచే వర్ధిల్లుచున్నవో ఎందులయించుచున్నవో దేని స్వరూపమును బొందుచున్నవో అదే బ్రహ్మము," దానిని తెలిసికొనుము. అదే బ్రహ్మము అని చెప్పెను. అప్పుడాభృగువు తపస్సు చేసెను. అతఁడు తపస్సుచేసి.

ఇతి
ప్రథమోఽనువాకః

బ్రహ్మవేత్త మంచినిచెడ్డ బ్రహ్మముగనె
యెప్పుడుగవి తృప్తి పడు, నిదియుపనిషత్తు॥
ఉపనిషత్తు=బ్రహ్మవిద్యను దెలుపుతత్త్వము.

ఇది
తొమ్మిదవ యనువాకము.

ఇంక
భృగువల్లి
మొదటియనువాకము.

వరుణుసుతుఁడు భృగువల్ల తనఁ దండ్రి
వరుణు సమీపించి భక్తితోడ
"భగవానుఁడా! నాకుబ్రహ్మమున్ దెల్పవె"
యనుచు నడుగ నాతఁడనియెనిట్లు
అన్నంబు ప్రాణంబు కన్ను చెవి మనస్సు
వాక్కులు బ్రహ్మకున్ ద్వారములగు
ఎందుండి భూతంబు లివియెల్లఁ బుట్టునో
పుట్టియు దేనిచేఁ బుష్టిచెందు
పుష్టిఁజెందియు నాశంబు పొందునపుడు
ఎందులయమొందు; తాదాత్మ్యమొందునెందు
దీనినే బ్రహ్మమనుచును దెలిసికొనుము
అనఁగ భృగువుతపసు చేసె నట్లుచేసి॥

ఇది
మొదటి యనువాకము.

## అథ

## ద్వితీయోఽనువాకః

అన్నం బ్రహ్మేతి వ్యజానాత్. అన్నాద్ధ్యేవఖల్విమాని
భూతానిజాయంతే, అన్నేన జాతానిజీవంతి, అన్నం ప్రయంత్యభిసంవిశంతి ఇతి
తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితర ముపససార॥

అన్నమునుండియే ఈ ప్రాణులు పుట్టుచున్నవికదా పుట్టినవి అన్నముచే వర్ధిల్లుచున్నవి. అన్నమందె లయించుచున్నవి, అందెతాదాత్మ్య మొందుచున్నవి. కనుక అన్నమును మొదట బ్రహ్మగా దెలిసికొనెను, అది తెలిసికొని అన్నము పుట్టునుగదా అని తిరిగి సందేహముచే తండ్రియైన వరుణుని సమీపించెను.

అధీహి భగవో బ్రహ్మేతి, తంహోవాచ తపసాబ్రహ్మ
విజిజ్ఞాసస్వ తపో బ్రహ్మేతి, సతపోఽతప్యత, సతప స్తప్త్వా॥

భగవంతుడా! బ్రహ్మమును దెల్పుమని భృగుసడిగెను. అంత "తపస్సుచే బ్రహ్మమును దెలిసికొనుము తపస్సెబ్రహ్మము (తపస్సెబ్రహ్మను దెలుపుసాధనము) అని తండ్రిచెప్పెను అంత అతడు తపస్సుచేసెను. అతడు తపస్సుచేసి.

ఇతి

ద్వితీయోఽనువాకః

## అథ

## తృతీయోఽనువాకః

ప్రాణో బ్రహ్మేతి వ్యజానాత్ ప్రాణాద్ధ్యేవ ఖల్విమాని భూతానిజాయంతే
ప్రాణేన జాతాని జీవంతి ప్రాణం ప్రయం త్యభిసంవిశంతీతి
తద్విజ్ఞాయ పునరేవ వరుణం పితర ముపససార.

## ఇంక
## రెండవయను వాకము.

అన్నమందుండియెకద యీ యఖిల భూతములుపుట్టు
అన్నమునఁ బెరుగు; నటలయమయి తాదాత్మ్యమొందు
ననుచు మొదట నన్నమును బ్రహ్మంబుగాఁ దెలిసికొనియె
తెలిసికొని సంశయముతోడ. దిరుగఁదండ్రి దరిఁజేరి॥

తండ్రి చెప్పిన దానినిబట్టి మొదటఅన్నమును బ్రహ్మముగాఁ దెలిసికొని అన్నమునకుఁగూడఁ బుట్టుక కనిపించుటచే పుట్టుక కలిగినది బ్రహ్మమెట్టులగు నని సంశయించి తిరుగఁదండ్రిని సమీపించెనని భావము.

బ్రహ్మమునుగూర్చి నాకు దెల్పవె మహాత్మ!
అని భృగువడుగఁగాఁ దండ్రియనియె నిట్లు
తపసుచేసి బ్రహ్మఁదెలియు తపసెబ్రహ్మ
అనఁగ భృగువు తపసుచేసె నట్లుచేసి॥

## ఇది
## రెండవ యను వాకము.

## ఇంక
## మూఁడవ యను వాకము.

ప్రాణమందుండియె కద యీ యఖిలభూతములు పుట్టు
ప్రాణమునఁబెరుగు, నటలయమయి తాదాత్మ్యమొందు
ననుచుఁపిదపఁ బ్రాణమును బ్రహ్మంబుగాఁ దెలిసికొనియె
తెలిసికొని సంశయముతోడఁ దిరుగఁ దండ్రిదరిఁజేరి॥

ప్రాణము నుండియె ఈ ప్రాణులు పుట్టుచున్నవిగదా పుట్టినవి ప్రాణముచే వర్ధిల్లుచున్నవి. ప్రాణమందె లయించుచున్నవి, అందె తాదాత్మ్యమొందుచున్నవి. కనుక అతఁడు పిదప ప్రాణమును బ్రహ్మగాఁ దెలిసికొనెను. అది తెలిసికొని తిరిగి సందేహముచే తండ్రిని సమీపించెను.

అధీహి భగవో బ్రహ్మేతి. తంహోవాచ తపసా బ్రహ్మవిజిజ్ఞాసస్వ
తపో బ్రహ్మేతి సతపోఽతప్యత, సతప స్తప్త్వా॥

"భగవంతుఁడా! బ్రహ్మమును దెలుపుమని భృగునడిగెను. అంత" తపస్సుచే బ్రహ్మమును దెలిసికొనుము తపస్సె బ్రహ్మము అని తండ్రియనెను అతఁడు తపస్సుచేసెను అతఁడు తపస్సుచేసి

ఇతి

తృతీయోఽనువాకః

## అథ

## చతుర్థోఽనువాకః

మనో బ్రహ్మేతి వ్యజానాత్ మనసో హ్యేవ ఖల్విమాని
భూతానిజాయంతే, మనసాజాతానిజీవంతి, మనః ప్రయం
త్యభి సంవిశంతీతి, తద్విజ్ఞాయ పునరేవవరుణం పితర ముపససార॥

మనస్సునుండియె యీ ప్రాణులు పుట్టుచున్నవిగదా. పుట్టినవి మనస్సు చేతనే వర్ధిల్లుచున్నవి, మనస్సునందె లయించుచున్నవి. అందె తాదాత్మ్యమొందుచున్నవి కనుక అతఁడు పిదప మనస్సును బ్రహ్మగాఁ దెలుసుకొనెను అది తెలిసికొని తిరుగ సందేహముచే తండ్రినిసమీపించెను.

అధీహి భగవో బ్రహ్మేతి, తంహోవాచ తపసా బ్రహ్మ
విజిజ్ఞాసస్వ తపో బ్రహ్మేతి, సతపోఽతప్యత సతపస స్తప్త్వా॥

ప్రాణమునకుఁగూడఁ బుట్టుక కలిపించుటచేఁ బ్రాణము బ్రహ్మమెట్టులగు నని సంశయించి తిరుగ.దండ్రిని సమీపించెనని భావము.

బ్రహ్మమునుగూర్చి నాకుఁదెల్పవె మహాత్మ!
అని భృగువడుగఁగాఁగాఁ దండ్రియని యెనిట్లు
తపసుచేసి బ్రహ్మఁదెలియు తపసెబ్రహ్మ
అనఁగ భృగువు, తపసుచేసె నట్లుచేసి

ఇది

**మూఁడవ యనువాకము.**

ఇంక

**నాలుగవ యనువాకము.**

మనసునుండియె కద యీ యఖిలభూతములు పుట్టు
మనసునఁబెరుగు, నటలయమ ది తాదాత్మ్యమొందు
ననుచుఁబిదప మనసును బ్రహ్మంబుగాఁ దెలిసికొనియె
తెలిసికొని సంశయముతోడ, దిరుగఁ దండ్రిదరిఁజేరె॥

మనస్సునకుఁగూడ పుట్టుక కనిపించుటచే పుట్టునది బ్రహ్మ మెట్టునగునని సంశయించి తండ్రి దగ్గరకుఁ బోయెనని భావము.

బ్రహ్మమునుగూర్చి నాకుఁదెల్పవే మహాత్మ!
అని భృగువడుగఁగాఁ దండ్రియనియె నిట్లు

భగవంతుఁడా! బ్రహ్మమును దెల్పుమని భృగునడిగెను. అంత "తపస్సుచే బ్రహ్మమును దెలిసికొనుము, తపస్సె బ్రహ్మముఅని తండ్రి చెప్పెను. అంత నతఁడు తపస్సుచేసెను. అతఁడు తపస్సుచేసి.

ఇతి
చతుర్థోఽనువాకః

### అథ
### పంచమోఽనువాకః

విజ్ఞానం బ్రహ్మేతి వ్యజానాత్, విజ్ఞానాద్ధ్యేవ ఖల్విమాని
భూతాని జాయంతే, విజ్ఞానేన జాతానిజీవంతి, విజ్ఞానం
ప్రయం త్యభిసంవిశంతీతి, తద్విజ్ఞాయ పునదేవవరుణం పితర ముపససార.

విజ్ఞానమునుండియె యీ ప్రాణులు పుట్టుచున్నవిగదా. పుట్టినవిజ్ఞానము చేతనె వర్ధిల్లుచున్నవి. విజ్ఞానమందెలయించుచున్నవి. అదెంతాదాత్మ్యమొందు చున్నవి. కనుక ఆతఁడు పిదప విజ్ఞానమును బ్రహ్మగాఁ దెలిసి కొనెను అదితెలుసుకొని సందేహముచే తండ్రిని సమీపించెను.

అధీహి భగవో బ్రహ్మేతి, తంహోవాచ, తపసా
బ్రహ్మ విజిజ్ఞాసస్వ తపో బ్రహ్మేతి సతపోఽతప్యత్, సతప స్తప్త్వా

భగవంతుఁడా! బ్రహ్మమును దెల్పుమని భృగునడిగెను. అంత "తపస్సుచేసి బ్రహ్మమును దెలిసికొనుము, తపస్సె బ్రహ్మము అని తండ్రి చెప్పెను. అంత నతఁడు తపస్సుచేసెను. అతఁడు తపస్సుచేసి.

ఇతి
పంచమోఽనువాకః

### అథ
### షష్ఠోఽనువాకః

ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్, ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని
జాయంతే, ఆనందేనజాతాని జీవంతి, ఆనందం ప్రయంత్యభిసంవిశంతీతి॥

తపసుచేసి బ్రహ్మఁదెలియు, తపసెబ్రహ్మ
అనఁగ భృగువు తపసుచేసెనట్లు చేసి॥

ఇది
నాల్గవ యనువాకము.

ఇంక
అయిదవ యనువాకము.

అట్టి విజ్ఞానమందుండి యఖిలభూతములు పుట్టు
అందె పెరుగు; నందెలయము బొంది తాదాత్మ్యమొందు
ననుచువిజ్ఞానమునిఁక బ్రహ్మంబుగాఁ దెలిసికొనియె
తెలిసికొని సంశయముతోడఁ దిరుగఁదండ్రి దరిఁజేరి॥

బ్రహ్మమునుగూర్చి నాకుఁదెల్పవె మహాత్మ!
అని భృగువడుగఁగాఁ దండ్రియనియె నిట్లు
తపసుచేసి బ్రహ్మఁదెలియు; తపసెబ్రహ్మ
అనఁగ భృగువు తపసు చేసినట్లు చేసి॥

ఇది
అయిదవయనువాకము.

ఇంక
ఆఱవయనువాకము.

అట్టియానందమునఁ బ్రాణులన్ని పుట్టు
పుట్టియానందమునఁ గడుఁబుష్టిచెందు
అందెలయమునుబొంది తాదాత్మ్యమొందు
అనుచు నానందమె బ్రహ్మమని యెఱింగె॥

ఆనందమునుండియే యీ ప్రాణులు పుట్టుచున్నవి. పుట్టినవి ఆనందముచే వర్థిల్లుచున్నవి. ఆనందమందె లయించుచున్నవి, ఆనందమందేతాదాత్మ్యమొందు చున్నవి కనుక అతఁడు పిదప ఆనందమును బ్రహ్మముగఁదెలిసికొనెను.

సైషా భార్గవీవారుణీ విద్యా
పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా॥

భృగువు తెలిసికొన్న వరుణుండు చెప్పిన యీ విద్య యుత్తమమైన హృదయాకాశమందుఁ బ్రతిష్ఠించి యున్నది.

స య ఏవం వేద ప్రతితిష్ఠతి, అన్నవానన్నాదో భవతి
మహాన్ భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మవర్చసేన మహాన్‌కీర్త్యా॥

ఎవఁడిట్లు తెలిసికొనునో వాఁడానందబ్రహ్మమందె నిల్చును. అన్నము గలవాఁడై అన్నముతినఁగలవాడగును సంతానముచే పశువులతో బ్రహ్మ వర్చస్సుతో గొప్పవాఁడగును. కీర్తితోగూడ గొప్పవాఁడగును.

ఇతి
షష్ఠోఽనువాకః

అథ
## సప్తమోఽనువాకః

అన్నం న నిన్ద్యాత్, తద్వ్రతం, ప్రాణోవా అన్నం శరీరమన్నాదం
ప్రాణేశరీరం ప్రతిష్ఠితం శరీరేప్రాణః ప్రతిష్ఠితః తదేతదన్నమన్నే ప్రతిష్ఠితం॥

అన్నమును నిందింపరాదు. అది వ్రతము. ప్రాణమె అన్నము. శరీరము అన్నమునుదినునది. ప్రాణమందు శరీరమునిలిచియున్నది శరీర మందు ప్రాణమునిలిచియున్నది. ఇట్టియన్నము అటువంటి యన్నమందు నిలిచి యున్నది.

స య ఏత దన్నమన్నే ప్రతిష్ఠితంవేద, ప్రతితిష్ఠతి, అన్నవాన్
అన్నాదో భవతి, మహాన్‌భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మర్చసేన, మహాన్‌కీర్త్యా

ఇటులవరుణుండు బోధింప భృగువుతపసు
నాచరించి తెలిసికొన్న యమలవిద్య
హృదయ పద్మకోశాకాశవిదితగుహను
నిశ్చలానంద పదమున నిలిచియుండె

ఇట్టియానంద బ్రహ్మంబు నెఱుఁగు వాఁడందెనిల్చి
అధికమౌ నన్నములఁబొందు; నన్నముల్ తినఁగఁజాలు
పశులతో సంతతులతోడ బ్రహ్మవర్చసముతోడ
పరమశుభకీర్తితోఁ గడువర్ధిల్లు మహితుఁడగును॥

ఇది

ఆఱవయనువాకము

ఇంక

ఏడవయనువాకము.

అన్నము నిందచేయరాదది వ్రతంబు
ప్రాణమును నన్నమె శరీరమన్నముఁదిను
ప్రాణమునమేను, మేనునఁబ్రాణముండె
అట్టి యీ యన్నమే యన్నమందునిలుచు॥

అన్నమందన్నముండుట గన్నవాఁడందె నిల్చి
అధికమౌ నన్నమునఁబొందు నన్నముల్ తినఁగఁజాలు

ఎవఁడిట్లు ఈ యన్నము అన్నమందుండుటను తెలిసికొనువాఁడు అన్నమందె నిలిచియుండును అన్నవంతుఁడై అన్నమును దినువాఁడగును. సంతానముతోను పశువులతోడను బ్రహ్మవర్చస్సుతోను గొప్పవాఁడగును కీర్తిచే గొప్పవాఁడగును.

ఇతి

సప్తమోఽనువాకః

అథ

**అష్టమోఽనువాకః**

అన్నం న పరిచక్షీత తద్వ్రతం, ఆపోవా అన్నం జ్యోతిరన్నాదం
అప్సుజ్యోతిః ప్రతిష్ఠితం, జ్యోతిష్యాపః ప్రతిష్ఠితాః
తదేదన్న మన్నే ప్రతిష్ఠితం॥

అన్నమును విడిచిపెట్టరాదు. అది వ్రతము నీరే అన్నము, జ్యోతిస్సు అన్నమునుదినునది. నీటియందు జ్యోతినిలిచియున్నది. జ్యోతిస్సునందు నీళ్లు నిలిచియున్నవి. ఆ యీ యన్నము అగ్నియందు నిల్చియున్నది.

సయ ఏత దన్నమన్నే ప్రతిష్ఠితం, సయఏత దన్నమన్నే
ప్రతిష్ఠిం వేద ప్రతిష్ఠతి, అన్నవానన్నాదో భవతి,
మహాన్ భవతి, ప్రజయా పశుభిర్బ్రహ్మ వర్చసేన మహాన్ కీర్త్యా॥

ఎవఁడిట్లు ఈ యన్నము అన్నమందుండుటను దెలుసుకొనునో వాఁడు అన్నమందె నిలిచియుండును. అన్నవంతుఁడై అన్నమును దినువాఁడగును. సంతానముతోను పశువులతోను బ్రహ్మవర్చస్సుతోను గొప్పవాఁడగును కీర్తితోను గొప్పవాండగును.

ఇతి

అష్టమోఽనువాకః

పసులతో సంతతులతోడ బ్రహ్మవర్చసముతోడ
పరమశుభకీర్తితోఁ గడువర్ధిల్లు మహితుఁడగును.

ఇది

పదవయను వాకము.

ఇంక

ఎనిమిదవయను వాకము.

అన్నముఁ బరిహరిపరా దదివ్రతంబు
ఆ జలమెయన్నమగు; జ్యోతియన్నముఁదిను
జలమునన్ జ్యోతి, జ్యోతిలో జలమునుండు
అట్టియీ యన్నమే యన్నమందునిలుచు.॥

అన్నమందన్నముండుట గన్నవాఁడందేనిలుచు
అధికమౌ నన్నములఁ బొందు నన్నముల్ తినఁగఁజాలు
పసులతో సంతతులతోడ బ్రహ్మవర్చసముతోడ
పరమశుభకీర్తితోఁ గడువర్ధిల్లు; మహితుఁడగును.

ఇది

ఎనిమిదవయను వాకము

అథ

నవమోఽనువాకః

అన్నంబహుకుర్వీత తద్వ్రతం, పృథివీవా అన్నం
ఆకాశోఽన్నాదః, పృథివ్యామాకాశః ప్రతిష్ఠితః ఆకాశే
పృథివీ ప్రతిష్ఠితా, తదేతదన్నమన్నే ప్రతిష్ఠితం॥

అన్నమును ఎక్కువగాఁ బండింపవలయును అదివ్రతము. భూమియే అన్నము. ఆకాశము అన్నముఁదినునది. భూమియందు ఆకాశమున్నది. ఆకాశమందు భూమియున్నది. ఆ యీ యన్నము అన్నమందు నిలిచి యున్నది.

తదేదన్నమన్నే ప్రతిష్ఠితం, సయ ఏత దన్న మన్నే
ప్రతిష్ఠితం వేద ప్రతిష్ఠితి, అన్నవానన్నాదోభవతి
మహాన్ భవతి ప్రజయా పశుభిర్బ్రహ్మ వర్చసేన మహాన్ కీర్త్యా॥

ఎవఁడిట్లు ఈ అన్నమందుండుటను దెలిసికొనునో వాఁడు అన్నమందె నిలిచియిండును. అన్నవంతుఁడై అన్నమును దినువాఁడగును. సంతానముతోడను పశువులతోను బ్రహ్మవర్చస్సుతోను గొప్పవాఁడగును. కీర్తితోను గొప్పవాఁడగును.

ఇతి
నవమోఽనువాకః

అథ

దశమోఽనువాకః

నకంచన వసతౌ ప్రత్యాచక్షీత, తద్వ్రతం, తస్మాద్యయా కయాచ
విధయా బహ్వన్నం ప్రాప్నుయాత్, అరాధి అస్మై అన్నమిత్యాచక్షతే
ఏతద్వైముఖతోఽన్నంరాద్ధం, ముఖతోఽస్మై అన్నంరాధ్యతే

ఇంక

తొమ్మిదవయనువాకము.

అన్నముఁగడుఁ గూర్పవలయునది వ్రతంబు
అవనియునునన్న; మాకాశమన్నముఁదిను
అవని నాకస; మాకసమందునవని
యలరు; నిట్టియన్నమె యన్నమందునిలుచు॥

అన్నమందన్నముండుటఁగన్న వాఁడందెనిలుచుట
అధికమౌ నన్నములఁబొందు; నన్నముల్ తినఁగఁజాలు
పశులతో సంతతులతోడ బ్రహ్మవర్చసముతోడ
పరమ శుభకీర్తితోఁ గడువర్ధిల్లు; మహితుఁతుడగును॥

ఇది

తొమ్మిదవయను వాకము.

ఇంక

పదవయనువాకము.

తనయింటికరుదెంచిన వానినెన్నఁడు
నవలఁ బొమ్మనఁగరా దది వ్రతంబు
ఇఁకనందుచే నేదోలాగు న్యాయత
నన్నంబుప్రోగు చేయంగవలయు
అరుగుదెంచిన వాని"కన్నంబు సిద్ధమై
నది యందు మనమన్ననంగవలయు"

ఎతద్వై మధ్యతో౽న్నం రాద్ధం మధ్యతో౽స్మా అన్నం రాధ్యతే
ఏతద్వా అంతతో౽న్నం రాద్ధం అంతతో అస్మా అన ం రాధ్యతే
య ఏవం వేద.

ఇంటికి వచ్చినవానినెవనిని వసతి ఇవ్వనని నివారింపరాదు. అది వ్రతము, కనుక తనవిధికృత్యములలో ఏదోవిధముచే ఎక్కువయన్నమును సంపాదింపవలయు. పెద్దలు వచ్చినవీనికి అన్నము సిద్ధముగా నున్నదందురు. బాల్యమున ముఖ్యముగా అతిథికి నన్నముస్థిరమైనచో అన్నము పెట్టినవానికి బాల్యమున నన్నము సిద్ధమగును. నడియస్సున అన్నము సిద్ధము అయినచో నడివయస్సునందును అన్నము సిద్ధమగును, చివరివయస్సున అన్నము సిద్ధముగా నున్నదన్నచో జివరివయస్సునం ద .కును అన్నముసిద్ధమగును. ఎవ(డిది తెలిసి కొనునో వానికిని అన్నము సిద్ధమగును.

క్షేమ ఇతివాచి యోగక్షేమ ఇతి ప్రాణాపానయోః
కర్మేతి హస్తయోః గతిరితి పాదయోః, విముక్తిరితి పాయౌ
ఇతిమానుషీఃసమాజ్ఞాః

బ్రహ్మము వాక్కున క్షేమరూపమున ప్రాణాపానములందు యోగ క్షేమ రూపమై చేతులందు కర్మరూపమై పాదములందు గమనరూపమై పాయుద్వారమునందు మల విమోచన రూపమై యున్నది" ఇవి మనుజులు చేయ(దగిన యుపాసనలు.

అథదైవీః, తృప్తిరితి వృష్టౌ, బలమితి విద్యుతి, యశ ఇతి
పశుషు, జ్యోతిరితినక్షత్రేషు, ప్రజాతిరమృతానంద ఇత్యుపస్థే
సర్వమిత్యాకాశే, తత్ప్రతిష్ఠే త్యుపాసీత. ప్రతిష్ఠావాన్భవతి
తన్మహ ఇత్యుపాసీత మహాన్భవతి॥

ఇంక దైవోపాసనలు చెప్ప(బడుచున్నవి, బ్రహ్మము వర్షమందు అన్నాదిహేతువగు తృప్తిరూపముగను మెఱుపునందు బలముగను, పశుపులందె యశస్సుగను నక్షత్రములందు జ్యోతిగను ఉపస్థమందు సంతానముగ అమృతముగ ఆనందముగను, ఆకాశమందు సర్వ వస్తురూపముగను ఉండును. కనుక అది యన్నిటికి ఆధారమని యుపాసించవలెను. ఉపాసించు వాడు

జిన్నప్ప తనకును నన్నమొదవు

నడివయస్సున శ్రద్ధగా నన్నమిడిన
నడివయస్సునఁ దనకును నన్నమొదవు
అంత్యవయస్సున శ్రద్ధగా నన్నమిడిన
అంత్యవయసునఁ దనకును నన్నమొదవు
మఱి యునిటు గాంచువాఁడు తత్ఫలమునొందు॥

వాక్కులను బ్రహ్మ క్షేమరూపమయి. యపానమునను
ప్రాణమునను యోగక్షేమమయి, కేలఁగర్మ యగును
పాదములగతియై పాయువందు విముక్తి యగును
అనియుపాసింపఁదగు నివిమనుజు నుపాసనములు॥

మఱిఁక దైవోపాసనలు చెప్పఁబడు, బ్రహ్మ
తృప్తియై యన్నాత్మ దృష్టి నుండు
మెఱపులో బ్రహ్మంబు బలరూపమై యుండు
పశువుల యశస్సు రూపముననుండు
అమృతమై యానందమై పుత్త్రరూపతన్
బ్రహ్మ ముపస్థమం దమరియుండు
ఒగిని నక్షత్రాల జ్యోతిరూపతనుండు
నాకసంబున సమస్తాత్మకమగు
ఇది ప్రతిష్ఠ యనుచు నుపాసింపవలయు
దీననీయుపాసకుడు, ప్రతిష్ఠపొందు

ప్రతిష్ఠకలవాఁడగును, దానిని మహత్తత్త్వముగల దానినిగ ఉపాసింపవలయును.
ఉపాసించినవో గొప్పవాఁడగును.

తన్మనఇత్యుపాసీత, మానవాన్ భవతి,
తన్నమ ఇత్యుపాసీత, నమ్యంతేఽస్మైకామాః॥

ఆ బ్రహ్మమును మనసు అని యుపాసింపవలెను. మనసశక్తిగలవాఁడగును నమసు అని యుపాసింపవలెను. వీనికిఁ గామములు లొంగి యుండును.

తద్బ్రహ్మేత్యుపాసీత బ్రహ్మవాన్ భవతి, తద్బ్రహ్మణః
పరిమర ఇత్యుపాసీత, పర్యేణం మ్రియంతే ద్విషంతః సపత్నాః
పరియేఽప్రియా భ్రాతృవ్యాః, సయశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే స ఏకః

ఆ బ్రహ్మ చాలగొప్పదని యుపాసింపవలయు చాలగొప్పగుణము గలవాడగును, ఆ బ్రహ్మవంటి యాకాశమును పరిమరమని యుపాసింపవలయు ఈ యుపాసకుని ద్వేషించువారు శత్రువులు అప్రియులైన భ్రాతృవ్యులు మరణింతురు, పురుషుని హృదయమందున్న బ్రహ్మమును సూర్యమండల మందున్నదియు నొకటే.

సయ ఏవంవిత్ అస్మాల్లోకాత్ప్రేత్య ఏతమన్నమయ
మాత్మాన ముపసంక్రమ్య, ఏతం ప్రాణమయ మాత్మానముపసంక్రమ్య
ఏతం మనోమయ మాత్మానముప సంక్రమ్య, ఏతం విజ్ఞానమయ
మాత్మన ముపసంక్రమ్య
ఏత మానందమయ మాత్మాన ముపసంక్రమ్య ఇమాల్లోకాన్ కామాన్నీ
కామరూపే అనుసంచరన్॥

ఇట్లు దెలిసినవాఁడు ఈ లోకమునుండిపోయి ఈ యన్నమయాత్మను పొంది యీ ప్రాణమయాత్మనుపొంది ఈ మనోమయయాత్మను పొంది ఈ విజ్ఞానమయాత్మను పొంది యీ యానందమయాత్మను పొంది ఇష్టమైన యన్నముగలవాఁడై ఈలోకముల దిరుగును.

ఏతత్సామ గాయన్నాస్తే, హా౩ వు హా౩ వు హా౩ వు
అహమన్న మహమన్న మహమన్నం, అహమన్నాదో౩ అహమన్నాదో౩
అహమన్నాదః, అహంశ్లోకకృ దహంశ్లోకకృదంశ్లోకకృత్

ఇదె మహత్తుగలదని యుపాసింపవలయు
నవల నీయుపాసకుఁడు మహత్త్వమొందు॥
ఇదియె మననమనుచును నుపాసింపవలయు
మఱియు నీయుపాసకుఁడెంతొ మననమొందు
ఇఁక నమన గుణమని యుపాసింపవలయు
ఈ యుపాసకునికిఁ గోర్కెలెల్ల లొంగు॥
ఇదె బ్రహత్త మనమని యుపాసింప బృహద్గుణుఁడగు
ఆకసంబును బరిమరమని యుపాసింపవలయు
వానిద్వేషులు నప్రియుల్ భ్రాతృవ్యులు మరణింత్రు
పురుషహృదిలోను రవిమధ్యఁగలది యాబ్రహ్మమొకటె॥

పరిమరము=తెరచాప. మెఱపుస్సృష్టి, చంద్రుఁడు సూర్యుఁడు అగ్ని అను నైదుదేవతలను గ్రమింగునదిగావ ఆకాశముగూడ పరిమరమనంబడెను.

ఇట్లు విధిగాంచు వాఁడట కేగి యన్నమయమాత్మ
పొందిప్రాణ మయాత్మనుబొంది విజ్ఞాన మయము
పొంది యానందమయమాత్మ పొందియిష్టాన్నముఁదిని
కామరూపుఁడై యిట్టిలోకములలోఁ దిరుగుచుండు॥

ఈయన్న మయాదిరూపములను దెలిసినవాఁడు అన్నమయాదులను క్రమముగా ఆనందమయము వఱకుపొంది స్వేచ్ఛాహారుఁడై యాయాలోకములను దిరుగును. తానేకరూపుఁడైనను సర్వశక్తిమంతుఁడుగాన సర్వరూపుఁడుగానఁ దనకిష్టమైన రూపములను బొందునని భావము.

ఆహా! యాహా! యాహా! యాయన్నమను నేను
ఆయన్నమను నేను నన్నమేను
అన్నభక్షిని నేను అన్నభక్షిని నేను
అన్నభక్షిని నేను ననవరతము.
అన్నాన్నభక్షుల నటఁగల్పువాఁడేను
గల్పువాఁడను నేనుగల్పువాఁడ
సత్యంబునకుమున్నె జనియింతునేను; దే
వులకు ముందేనేను పుట్టినాఁడ

అహమస్మి ప్రథమజాఋతా 3 స్య, పూర్వందే
వేభ్యోఽమృతస్య నా 3 భాయి. యో మాదదాతి
స ఇదేవ మా 3 వాః, అహ మన్నమన్నమదంత మా 3 ద్మి

అహో! అహో! అహో! నేను అన్నమను నేను అన్నమను నేను అన్నమను నేను అన్నము దినువాఁడను నేను అన్నముదినువాఁడను. నేను అన్నముదినువాఁడను నేను అన్నమును అన్నభక్షకుని గల్పువాఁడను (శ్లోకః—అన్నాన్న భక్షక సంఘాతః) నేను అన్నాన్న భక్షకులఁగల్పు వాఁడను అన్నాన్న భక్షకులఁ గల్పువాఁడను. అన్నిటికంటె ముందుపుట్టిన సత్యమునకుముందె యున్నవాఁడను. దేవతలకంటె పూర్వమె నేను అమృతమునకు మూలమును అన్నరూపుఁడనైన నన్ను అర్థులకిచ్చువాఁడు నన్ను రక్షించువాఁడగును. అర్థులకీయక తనకు తానేతినువానిని నేనే భక్షించెదను.

అహం విశ్వం భువన మభ్య భవా 3 మ్
సువర్న జ్యోతీః య ఏవం వేద, ఇత్యుపనిషత్॥

నేనీ సమస్తమైన భువనమును సంహరించి యుపసంహరింతును. నాజ్యోతిస్సు సూర్యునివలెఁ బ్రకాశించును. దీనిని దెలిసినవాఁడు ముక్తిపొందును. ఇది తత్త్వబోధకమైన యుపనిషత్తు

ఓమ్ (చూ. ఉపనిషత్తు మొదట)

శాంతిమంత్రః

ఇతి

దశమోఽనువాకః

భృగువల్లీ సమాప్తా

తైత్తిరీయోపనిషత్ సమాప్తా

అమృతమునకు నాభిని, నన్నమైన నన్ను
అన్నపరుకిచ్చువాఁడిట్లె నన్నుఁబ్రోచు
అన్నమౌనన్ను వచ్చిన యర్థికిడక
తానెయన్నముఁ దినువాని నేనెతిందు॥

ఏనెయీ సర్వజగము లయింపఁజేతు
అర్కువలెఁ బ్రకాశింతు నేననెడు సామ
గానమును జేయువాఁడు మోక్షమెనయు, నిది
యొుగిఁదెలియ ముక్తుఁడౌ నివియుపనిషత్తు॥

శాంతిమంత్రము (చూ. ఉపనిషత్తు. మొదటి)

ఇది

పదవ యనువాకము.

భృగువల్లి సమాప్తము.

ఇది

బ్రహ్మశ్రీ చర్ల నారాయణ శాస్త్రీ జనకగురువర ప్రాప్తవిద్యుఁడును
వెంకమాంబాపుత్రుఁడును నగు గణపతిశాస్త్రిచే ననువదింపఁబడిన

తైత్తిరీయోపనిషత్తు.

## ఐతరేయోపనిషత్

ఋగ్వేద బ్రాహ్మణారణ్యకాం డాంతర్గతద్వితీయారణ్యకస్థా॥

ప్రథమాధ్యాయే ప్రథమః ఖండః

శాంతిమంత్రః

ఓమ్

వాఙ్మే మనసి ప్రతిష్ఠితా మనో మే వాచి ప్రతిష్ఠితం
ఆవి రావీర్మఏధి, వేదస్య మ ఆణీస్థః శ్రుతంమే
మా ప్రహాసీ, రనే నాఽధీతే నాఽహోరాత్రాన్ సందధామి
ఋతం వదిష్యామి సత్యం వదిష్యామి తన్మా మవతు
తద్వక్తా రమవతు అవతుమాం అవతు వక్తారం అవతువక్తారం॥

వాక్కు నామనస్సునందు నిలిచియున్నది. నామనస్సు వాక్కునందు నిలిచియున్నది, ఓ ఆత్మ! నాకుఁ బ్రకటమవగుము, ఓ వాఙ్మనసులార! నాకు వేదమును రప్పింపుఁడు. నేను విన్నదానిని మఱవకుందునుగాక, ఈ చదువుచే రాత్రియుఁ బగలును గలిపియుందును పరమార్థ వస్తువును పలుకుదును సత్యమును బలుకుదును, అది నన్నురక్షించుఁగాక, దానినిచెప్పిన గురువును రక్షించుఁగాక, దానిని చెప్పిన గురుని రక్షించుఁగాక గురువునురక్షించుగాక.

ఓమ్

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓం. ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్కించనమిషత్
స ఈక్షత లోకాన్ను సృజా ఇతి స ఇమాన్‌లోకా నసృజత
అంభో మరీచీ ర్మరమాపోఽధోఽంభః పరేణ దివం
ద్యౌః ప్రతిష్ఠాఽంతరిక్షం మరీచయః పృథివీ
మరోయా అధస్తాత్ తా ఆపః॥

మొదట ఈ ప్రపంచమంతయు ఒక యాత్మగనె యుండెను. మిగిలిన దేదియుఁ గదలునదిలేదు. లోకములను సృజించెదను అని యా యాత్మ యాలోచించెను, అంత అది (స్వస్వకర్మఫలోప భోగస్థానములయిన) అంభస్సు మరీచులు మరము అప్పులు అను నీలోకములను సృజించెను. ద్యులోకమునకుఁ బైఁగానున్న యాలోకము అంభస్సు. ఈ అంభస్సునకు ద్యులోకము ఆధారము ద్యులోకము క్రిందనున్న అంతరిక్షలోకమె మరీచులు అనులోకము. భూమియె

## ఐతరేయోపనిషత్తు

### మొదటియధ్యాయమున మొదటి ఖండము.

శాంతిమంత్రము

**ఓమ్**

నాదువాక్కు మది నిస్థిరంబగుఁగాక, నామనస్సు
వాక్కునస్థిరంబగుత; మాత్మ! ప్రకటంబవగుము నాకు
వాఙ్మనసులార! శ్రుతినాకుఁ బ్రకటింప శక్తులుఁగుడు
నేవినినది పోకుండుత మీవిద్యరాత్రిపవలు
గనెదను యథావిధి వచించెదను సత్యమునె వచింతు
అదియెననుఁ బ్రోచుఁగావుత మదెగురుఁ బ్రోచుఁగాత
నన్నుఁబ్రోచుత, గురు బ్రోచు నదెగురుఁ బ్రోచుఁగాత॥

ఈ ప్రార్థన శిష్యునికి అవిద్యానివృత్తి రూపఫలమును, గురునికి ఉత్తమ శిష్యునికి తత్త్వము చెప్పుటద్వారా విద్యాసంప్రదాయ ప్రవృత్తి రూప ఫలమును గూర్చునని భావము.

ఓం

శాంతి శాంతి శాంతి.

సృష్టికి మునుముందె యీసమస్త జగమం
తయుఁగేవలమొక యాత్మగనెయుండె
అపుడింకఁ జలియించునది మఱొండెదియు లే;
గది జగాలు సృజింతునని తలంచె
ఇటుల సంకల్పించి యెదలోన నయ్యాత్మ
యీ సమస్త జగంబు లిటుసృజించె
అంభస్సును మరీచు లవల మరంబును
అప్పు లనుజగంబు లదిసృజించె॥

అంభసుద్యులోకమునకును నవలనుండె
అంభసుకు ద్యులోకంబె యాశ్రయంబు
అమరీచుల్ దివముక్రింది యంతరిక్ష;
మిందుక్షితి మర; మప్పులాక్రిందనుండె॥

మరముఅనులోకము, దానిక్రిందనున్నదియె అప్పులు అనులోకము. ఈ యాత్మ ఆకాశాదిక్రమముగ బ్రహ్మాండమును సృజించి అంభస్సు మొదలగు లోకములను సృజించెననిభావము.

స ఈ క్షత ఇమేను లోకా, లోకపాలాన్ను సృజా ఇతి
సోఽద్భ్య ఏవ పురుషం సముద్ధృత్యాఽమూర్ఛయత్, తమభ్యతపత్
తస్యాఅభిత ప్తస్య ముఖం నిరభిద్యత యథాఅండం
ముఖాద్వాక్ వాచోఅగ్నిః, నాసికే నిరభిద్యేతాం
నాసికాభ్యాం ప్రాణః ప్రాణాద్వాయుః అక్షిణీ
నిరభిద్యేతాం అక్షిభ్యాం చక్షుః చక్షుష ఆదిత్యః॥

అతఁడీలోకములు ఈ లోకములకుఁ బాలకులను సృజింతును అని యాలోచించెను. అతఁడు నీటినుండియె పురుషాకారమైన యవయవముల ముద్దను బయలు పఱచి కూర్చెను, పిదప దానీని దలఁచెను. ఆ సంకల్పించిన ధానినుండి పక్షిగ్రుడ్డువలె ముఖము బయలు వెడలెను. ముఖమునుండి వాక్కు-వాక్కున కధిదేవత యయిన యగ్నియు వెడలెను ముక్కులనుండి ప్రాణమును ఘ్రాణేంద్రియము దీనినుండి ప్రాణమునుండి యధిదేవతయగు వాయువును వెడలెను, పిదప కన్నులు ఆకన్నులనుండి నేత్రేంద్రియము దానియందు అధి దేవతయగు సూర్యుఁడును వెడలెను.

కర్ణౌనిరభిద్యేతా కర్ణాభ్యాం శ్రోత్రం శ్రోత్రాద్దిశః
త్వక్ నిరభిద్యత త్వచోలోమాని లోమభ్య ఓషధి వనస్పతయః

చెవులు బయలు వెడలెను. చెవులనుండి శ్రోత్రేంద్రియము శ్రోత్రేంద్రియమునుండి అధిదేవతలగు దిక్కులు వెడలెను. త్వక్కు వెడలెను. త్వక్కునుండి రోమములు, రోమములనుండి ఓషధులు వనస్పతులు వెడలెను (అనగా స్పర్శేంద్రియము దీనినుండి వీనినుండి) అధిదేవత వాయువు వెడలెను.

హృదయం నిరభిద్యత హృదయాన్మనో మనసశ్చంద్రమాః
నాభిర్నిరభిద్యత నాభ్యా అపానోఅపానాన్మృత్యుః

హృదయము వెడలెను హృదయమునుండి మనస్సు మనస్సునుండి యధిదేవత చంద్రుఁడు పుట్టెను. పిదప నాభివెడలె నాభినుండి యపానము అపానమునుండి అధిదేవత మృత్యువు వెడలెను.

శిశ్నం నిరభిద్యత శిశ్నాద్రేతో రేతస అపః

మరము=ప్రాణులు ఇందుమరణించునుగాన భూమి మరమని చెప్పఁబడెను.
ఇవ్విధియే లోకంబు లిఁకలోక పాలుర

సృజియింతు ననియాత్మయెదఁ దలంచె
అంభస్సునుండియె యది పురుషుసృజించి
యవయవాకృతి ముద్దయలరఁజేసె
ఆత్మమ ద్దనునెంచె నాముద్దయందుండి
మొదట గ్రుడ్డుకరణి ముఖము వెడలె
ముఖమునుండియు వాక్కుపొడమె వాక్కున నధి
దేవతయగు నగ్నిదేవుఁడొదవె

అవల ముక్కులొదవె ముక్కులందుఁ బ్రాణ
మలరె నట నధిదేవత యనిలమొదవె
అవలఁగనులొప్పె; నేత్రేంద్రియంబుకనుల
నలరె నటనధిదేవత యర్కుఁడొదవె॥

అవలఁ జెవులుపుట్టెఁ జెవులశ్రవణేంద్రియంబుపుట్టె
దీనియందుఁ గ్రమ్మఱ నధిదేవతల్ దిశలుపుట్టె
మఱియుఁ జర్మపుట్టె; నిటరోమములు చర్మేంద్రియమును
దీననోషధితరుల దేవత వాయువొదవె॥

పిదప హృదయంబు పుట్టె నాహృదినుండి మనసుపుట్టె
దీనియందును మఱియధి దేవుఁడౌ చంద్రుఁడొదవె
అవలనాభి పుట్టెను నాభియందపానంబుపుట్టె
దీనియందును మఱియధి దేవుఁడౌ మృత్యువొదవె॥

పిదపన్ జననేంద్రియమట
నొదవెను నచ్చోట వీర్యమొదవెను నచటన్

పిదప జననేంద్రియము పుట్టెను జననేంద్రియమునుండి రేతస్సుపుట్టెను రేతస్సునుండి యధిదేవతయగు ప్రజాపతి జలరూపముగ వెడలెను.

ఇతి
ప్రథమః ఖండః

అథ

## ద్వితీయః ఖండః

తాపునద్దేవతాః సృష్టా అస్మిన్ మహత్యర్ణవే ప్రాపతన్
త మశనాయాపిపాసాభ్యా మన్వవార్జత్, తా ఏన మబ్రువన్
ఆయతనంనః ప్రజానీహి యస్మిన్ ప్రతిష్ఠితా అన్నమదామేతి
తాభ్యో గామానయత్ తా అబ్రువన్ నవై నోఽయమలమితి
తా భ్యోఽశ్వమానయత్ తా అబ్రువన్ నవై నోఽయమలమితి
తాభ్యః పురుషమానయత్ తా అబ్రువన్ సుకృతంబతేతి॥

ఆ దేవతలైతే సృజింపఁబడినవారై యీ సంసారసముద్రమందుఁబడిరి. ఆ పురుషాకృతిగల ముద్దను ఆకలిదప్పికలతో నతఁడుగూర్చెను. ఆదేవతలు ఆకలిదప్పులచేఁ బాధింపఁబడి యీ సృష్టికర్తను బలికిరి. మాకు ఆశ్రయమును గూర్పుము అందుండి అన్నమును భుజింతుము" అని. వారికొఱకు గోరూపము గల పిండమును ఆ ప్రజాపతి రప్పించెను. అది మాకుసరిపోదు అనివారు పలికిరి అంత వారికి గుఱ్ఱమురూపముగల పిండమును రప్పించెను. ఇదియు మాకుసరి పోదని వారనిరి, పిదప ఆ ప్రజాపతి వారికై పురుషాకృతిగల పిండమును రప్పించెను. సెబాసు మాకిది బాగుగాఁ జేయఁబడినదని వారనిరి.

పురుషోవావ సుకృతం తా అబ్రవీత్ యథా
ఆయతనం ప్రవిశతేతి॥

అందువల్ల పురుషుఁడు సుకృతమనఁబడెను ఈశ్వరుఁడు "ఇది మీకుతగిన యాశ్రయమును బ్రవేశింపుఁ"డని పలికెను.

ఆధిదేవుఁడగు ప్రజాపతి
యొదవెను జలరూపమూని యుచితపుఁ గరణిన్॥

**ఇది**

**మొదటి ఖండము.**

**ఇంక**

**రెండవ ఖండము**

సృజియింపఁ బడినట్టి యీదేవత లపార
సంసారసాగర శయ్యఁబడిరి.
ఆదేవతల కాదియగు పురుషుని కిఁకఁ
డాఁకలి దప్పులనంతఁ గూర్చె
"మాకాశ్రయము గూర్పుమందుండి యన్నంబు
తినెద" మన్ని ప్రభుని దేవులనిరి
ఆపయి ప్రభువు గోరూపముగల పిండ
మునుసీయ; నిదిచాలదనిరివారు
పిదప ప్రభువశ్వరూపంబు వెలయుపిండ
మీయ నిదియుఁజాలదని వచింప, ప్రభువు
వారికై పురుషాకృతి వరలు పిండ
మిడ బళి! యిదిచక్కఁగాఁ జేయఁబడియెననిరి.

ఇక్కడ దేవతలు అనఁగా ఇంద్రియములనియుఁ జెప్పుకొన వచ్చును. అన్ని శరీరములలోను బురుషాకృతియెసరియైనది యనియింద్రియములు వానిని స్వీకరించెనని భావము.

పురుషాకృతిగల పిండము
సొంపిదిన్ జేయుటఁ బురుషుఁడుసుకృతమనఁబడెన్
మఱియీశుం "డీపిండము
చొరుఁడని యధిదేవతలను జూచివచించెన్

అగ్నిర్వాగ్భూత్వా ముఖంప్రావిశత్‌వాయుః ప్రాణోభూత్వా
నాసికేప్రావిశత్ ఆదిత్యశ్చక్షుర్భూత్వాఽక్షిణీ ప్రావిశత్
దిశఃశ్రోత్రం భూత్వా కర్ణౌ ప్రావిశన్ ఓషధి వనస్పతయో
లోమాని భూత్వా త్వచంప్రావిశన్, చంద్రమా మనో
భూత్వా హృదయం ప్రావిశత్, మృత్యురపానో
భూత్వా నాభింప్రావిశత్ ఆపోరేతో భూత్వాశిశ్నం ప్రావిశన్,
తమశనాయా పిపాసే అబ్రూతా మాభ్యామభిజానీహేతి
తే అబ్రవీత్॥

అగ్ని వాక్కయి ముఖమును ప్రవేశించెను వాయువు ప్రాణమై ముక్కులను ప్రవేశించెను. సూర్యుఁడు కన్నయి కన్నులను బ్రవేశించెను. దిక్కులు చెవియయి చెవులను బ్రవేశించెను, ఓషధివనస్పతులు రోమములై చర్మను ప్రవేశించెను. చంద్రుఁడు మనసై హృదయమును బ్రవేశించెను. మృత్యుదేవత అపానమై నాభిని బ్రవేశించెను. నీరు రేతస్సయి జననేంద్రియమును బ్రవేశించెను, అంత వానిని ఆకలిదప్పులు పలికెను. "మేమెక్కడ నుండవలయు"నని వాటిని రెంటినిగూర్చి యీశుఁడనెను.

ఏ తాస్వేవ వాం దేవతా స్వాభజామ్యేతాసు
భాగిన్యౌకరోమీతి, తస్మాద్యస్యై కస్యై చ
దేవతాయై హవిర్గృహ్యతే భాగిన్యా వేవ
అస్యా మశనాయాపిపాసే భవతః॥

ఈ దేవతలందే మీ యిరువురకు ఏర్పరచుచున్నాను వీనియందు భాగము గలవారినిగాఁ జేయుచున్నాను అని యిశుఁడనెను, కనుక ఏదేవతకిచ్చినను ఈ దేవతయందు ఆఁకలిదప్పులు భాగస్వాములే యగును.

ఇతి

ద్వితీయః ఖండః

అగ్ని వాగ్రూపమై యాస్యంబు చొచ్చెను
ధువిగాలి ప్రాణమై ముక్కుఁజొచ్చె
కన్నయిసూర్యుండు కనులందుజొచ్చెను
చెవియయి దిక్కులు చెవులఁజొచ్చె
క్షితినోషధులు వనస్పతులు రోమంబులై
చర్మేంద్రియంబున జక్కఁజొచ్చె
చంద్రుండు మనసయి చక్కఁగా హృదిఁజొచ్చె
మృత్యువపానమై మెసలెనాభి

నీరు వీర్యమయి జననేంద్రియముఁజొచ్చె
నింకనాఁకలిదప్పులు నీశునరసి
యేదిమేముండుచో, తెలిఁగింపుమీశ!
ననఁగనీశుండు వానితో నప్పుడనియె॥

మీకు నధిదేవతల స్థానమేర్పఱచితి
నందె పాల్గొనఁజేయుదు ననియెఁగాన
ఎటుల నేదేవతకు హవిస్సిడినఁగాని
యాఁకలియు దప్పి తమ భాగమటనె పొందు॥

ఇది

రెండవ ఖండము

## అథ

## తృతీయః ఖండః

స ఈక్షత ఇమేను లోకాశ్చ లోకపాలాశ్చ అన్నమేభ్యః సృజాఇతి
సోఽపోఽభ్యతపత్ తాభ్యోమూర్తి రజాయత
యావైసా మూర్తి రజాయత అన్నంవై తత్॥

ఇవేలోకములు వీరె లోకపాలురు వీరికి అన్నము సృజింతునని ఆత్మ తలఁచెను. అది నీళ్లను (ఇటు నీళ్లు అన్నిభూతములకు ఉపలక్షణము) ధ్యానించెను. ధ్యానించిననీళ్లనుండి రూపమునుపుట్టెను. ఏరూపమైతే పుట్టెనో అదే యన్నమయ్యెను.

తదేన త్సృష్టం పరాఙ్ అత్యజిఘాంసత్, తద్వాచా
అజిఘృక్షత్, తన్నాశక్నో ద్వాచాగ్రహీతుం, సయద్ధైనద్వాచా
అగ్రహైష్య, దభివ్యాహృత్యహైవాన్న మత్రప్స్యత్॥

ఆ యీ సృజిపఁబడిన యన్నము (ఎలుకలు మొదలగునవి పిల్లి మొదలగు వానినిజూచి దాటిపోయి పరువెత్తమొదలిడెను. అది (పిల్లి మొదలగునవి ఎలుక మొదలగువానిని) వాక్కుచేఁ బట్టలేకపోయెను. దానిని వాక్కుచేఁ బట్టుకొనఁగలిగియుండు నెడల నోటితో అన్నమని పలికినంతనే తృప్తిచెంది యుండెడిది.

తత్ప్రాణేన అజిఘృక్షత్ తన్నాశక్నోత్ ప్రాణేన గ్రహీతుం
స యద్ధైనత్ ప్రాణేనాగ్రహైష్యదభిప్రాణ్య హైవాన్న మత్రప్స్యత్॥

అది ఘ్రాణేంద్రియముచేఁ బట్టఁగోలెను. అది ఘ్రాణేంద్రియముచేఁ బట్టలేకపోయెను. ఘ్రాణేంద్రియము పట్టఁగలుగునెడల వాసనచూచినంతనే తృప్తిచెందియుండిరి.

తచ్చక్షుషాఽజిఘృక్షత్ తన్నాశక్నోచ్చక్షుషాగ్రహీతుం
స యద్ధైనచ్చక్షుషా అగ్రహైష్య తత్దృష్ట్వా హైవాన్నమత్రప్స్యత్॥

అది కంటిచేఁబట్టగోరెను. అది కంటిచేఁ బట్టలేకపోయెను, కన్నేపట్టఁ గలుగునెడలఁ జూచినంతనే తృప్తిచెందియుండును.

## ఇంక

### మూఁడవ ఖండము.

ఇవియెలోకముల్ వీరె లోకేశులింక
నన్నమును వీరికి సృజింతునని తలంచె
యీశుఁడానీళ్లఁగూర్చి ధ్యానించె నటఁ జ
రాచరపు రూపొదవె నదె యన్నమయ్యె॥

ఇట "నీళ్లు" అను పదముచేఁ బంచభూతములనుగూడ గ్రహింపవల యును. చరములు=పిల్లులు ఎలుకలు, మొ. అచరములు=పండ్లు కాయలు, మొ. తినఁబడునవి తినునవి యన్నియు నన్నములె.

ఆసృజింపఁ బడిన యన్న మన్నభక్షకునిఁ జూచి
భయముపడి పాఱ నదిదాని వాక్కుచేఁబట్టఁదలఁచె
కాని యది వాక్కుచే దాని గ్రహియింపలేకపోయె
అటులె యయిన నన్నమని పల్కుటఁ దృప్తిఁగనియె యుండు॥

ఆసృజింపఁబడిన యన్నమన్న భక్షకునిఁ జూచి.
కలతపడి పాఱ నదిదాని ఘ్రాణానఁబట్టఁ నలఁచె
కాని ఘ్రాణంబుచే దాని గ్రహియింపలేకపోయె
అటులెయయిన నన్నను మూర్కొనుటఁ దృప్తిగనియె యుండు॥

అసృజింపఁబడిన యన్న మన్నభక్షకునిఁజూచి
భయముపడి పాఱఁగంటిచేఁ బట్టఁగాఁదలఁచెదాని
కాని కంటిచే దాని గ్రహియింపలేకపోయె
అటులె యయిన నన్నమును జూచుటఁ దృప్తిగనియె యుండు॥

తచ్ఛ్రోత్రేణ అజిఘృక్షత్ తన్నాశక్నోత్ శ్రోత్రేణ గ్రహీతుం
సయద్ధైన చ్ఛ్రోత్రేణ అగ్రహైష్యత్ శ్రుత్వాహైవాన్న మత్రప్స్యత్॥

అదిచెవిచేఁ బట్టఁగోరెను అదిచెవిచేఁ బట్టలేకపోయెను, చెవియే పట్టఁ గలుగునెడల వినినంతనే తృప్తిచెందియె యుండును.

తత్త్వచా అజిఘృక్షత్ తన్నాశక్నోత్త్వచాగ్రహీతుం
స యద్ధైనత్త్వచా అగ్రహైష్యత్ స్పృష్ట్వా హైవాన్న మత్రప్స్యత్॥

అది చర్మముచేఁ బట్టఁగోరెను. అది చర్మముచేఁ బట్టలేకపోయెను అది చర్మముచేఁ బట్టగలుగునెడల అన్నమును ముట్టుకొనియె తృప్తిచెందియె యుండెను.

తన్మనసా అజిఘృక్షత్ తన్నాశక్నోత్ మనసాగ్రహీతుం
స యద్ధైన న్మనసా అగ్రహైష్యత్ ధ్యాత్వాహైవాన్న మత్రప్స్యత్॥

అది మనస్సుచేఁ బట్టఁగోరెను. అది మనస్సుచేఁ బట్టలేకపోయెను అది మనస్సుచేఁ బట్టఁగలుగునెడల అన్నమును దలఁచియే తృప్తిచెందియుండెడిది.

తచ్ఛిశ్నేన అజిఘృక్షత్ తన్నాశక్నోత్ శిశ్నేన గ్రహీతుం
స యద్ధైన చ్ఛిశ్నేన అగ్రహైష్యత్ విసృజ్యహైవాన్న మత్రప్స్యత్॥

అది జననావయముచేఁ బట్ట గోరెను. అది జననావయముచే బట్టలేకపోయెను అది జననావయముచేఁ బట్టగలుగునెడల అన్నమును విడిచియే తృప్తి చెంది యుండెడిదా.

తదపానేన అజిఘృక్షత్ తదావయత్ సైష
అన్నస్యగ్రహో యద్వాయు రన్నాయుర్వా ఏష యద్వాయుః

అది ముఖములోనికిపోయెడి యపానవాయువుచేఁ బట్టఁగోరెను. అప్పుడది పట్టుకొనెను కాన అపానవాయువు అన్నమును గ్రహించునది యయ్యెను. ఆ యీ వాయువు అన్నమెజీవనముగాఁ గలవాయువు.

స ఈక్షత కథంన్విదం మదృతే స్యాదితి స ఈక్షత
కతరే ప్రపద్యా ఇతి, స ఈక్షత, యది వాచాఽభివ్యాహృతం
యదిప్రాణేనాఽభిప్రాణితం యది చక్షుషాదృష్టం

ఆ సృజింపఁబడిన యన్నమన్న భక్షకునిజూచి
భయముపడి పాఱఁజెవులచేఁ బట్టఁగాఁ దలఁచె దాని
కాని చెవులచే దానిని గ్రహియింపలేకపోయె
అటులె యయిన నన్నమని వినుటఁ దృప్తిగనియె యుండు॥

ఆ సృజింపఁబడిన యన్న మన్న భక్షకునిజూచి
భయపడి పాఱనది దానిత్వక్కుచేఁ బట్టఁదలఁచె
కానిత్వక్కుచే దానిని గ్రహియింపలేక పోయె
అటులె యయిన నన్నమును దాకుటఁ దృప్తిగనియె యుండు॥

ఆ సృజింపఁబడిన యన్నమన్న భక్షకుని జూచి
భయముపడి పాఱ మనసుచేఁ బట్టఁగాఁదలఁచె దాని
కాని మనసుచే దానిని గ్రహియింపలేకపోయె
అటులె యయిన నన్నముఁ దలఁచుటఁ దృప్తిగనియె యుండు॥

ఆ సృజింపఁబడిన యన్నమన్న భక్షకునిజూచి
భయత పాఱ శిశ్నంబుచేఁ బట్టఁగాఁ దలంచెదాని
కాని శిశ్నముచే దాని గ్రహింపలేక పోయె
అటులె యయిన నన్నమువిడుచుటఁ దృప్తిగనియె యుండు॥

ఆ సృజింపఁబడిన యన్నమన్న భక్షకునిజూచి
భయముపడి పాఱ దాని నపానానఁబట్టఁ దలఁచె
అప్పుడడి యన్నముగ్రహించె నందుచే నా యపాన
మన్నము గ్రహించునదియయ్యె నందె యన్నజీవనంబు॥

అపానము=ముఖబిలమును బ్రవేశించి యన్నాదులను తినునట్లు చేయుచు లోన సంచరించు వాయువు.

నేనులేక యెటులీమేనుండు; నే మార్గ
మునఁ జొత్తునని యా విభుండు తలఁచె
వాక్కేతనంతటఁ బల్కుచోఁ బ్రాణంబె
త యంత బ్రతికించి తనరు నెడల
కన్నె త నంతటఁగాంచు చున్నచో

యది శ్రోత్రేణ శ్రుతం యదిత్వచా స్పృష్టం యది మనసాధ్యాతం
యది అపానేనాభ్యపానితం యది శిశ్నేన విసృష్టమథకోఽహమితి॥

ఆయాత్మ "ఇది నేనులేకుండ ఎట్లుండఁగలదని చూచెను. ఏద్వారముగుండ దీనిని ప్రవేశింతునని యాలోచించెను. వాక్కుచేఁ జెప్పఁబడినట్లైతే, ఘ్రాణముచే వాసనచూడబడినచో, కంటిచేఁజూడఁబడినచో చెవిచే వినఁబడినచో చర్మముచే ముట్టుకొనఁబడినచో మనస్సుచే ధ్యానింపఁబడినచో అపానముచే గ్రహింపఁబడినచో శిశ్నముచే విడువఁబడినచో ఇంకనేను ఎవడను అని తలఁచెను.

స ఏతమేతం సీమానం విదార్య ఏతయాద్వారా ప్రాపద్యత
సైషా విదృతిర్నామద్వా, స్తదేతన్నాందనం॥

అతఁడు ఈ తల పాపిడిని జీల్చుకొని యీమార్గముగుండఁ ప్రవేశించెను. ఆ యిది విధృతియనెడు ద్వారము. ఇందు ఆనందించుటచే నిది నాందనమునఁ బడె.

తస్యత్ర ఆవసథాస్త్రయః స్వాప్నా
అయమావస థోఽయమావసథోఽయమావసథ ఇతి॥

ఆయాత్మకు అక్కడ మూఁడు నివాసస్థానములు. ఆస్థానములలో ఈ జాగ్రదవస్థ, ఈ స్వాప్నావస్థ, ఈ సుషుప్తావస్థ అను స్వప్నములుగలవు (జాగ్రదాద్యవస్థలు మూఁడును వాస్తవమునకులేవు గాన స్వప్నమువంటివి గాన స్వప్నములను చెప్పఁబడెను) తండ్రిమేను తల్లిమేను గర్భము ఇవియు స్థానములే యగును.

సజాతో భూతా న్యభివ్యైఖ్యత్ కిమిహాన్యంవావదిషదితి
స ఏత మేవ పురుషం బ్రహ్మ తతమమపశ్యదిద మదర్శమితీ ౩॥

ఆత్మపుట్టి (జీవులశరీరమునఁ బ్రవేశించి) భూతములను ఇక్కడ బ్రహ్మముకంటె నింకనేమియున్నదని చెప్పఁగలనని వ్యక్తముగ తెలిసికొనెను. ఆజీవుఁడు ఈ శరీరమునఁ జొచ్చిన పురుషుని ఎక్కువగా విస్తరించి బ్రహ్మముగాఁ దెలిసికొనెను.

తనయంతఁ జెవియును వినెడు నెడల
ఇంకఁ ద్వక్కె తనంత స్పృశించు చున్నచో
తనయంతట మనస్సె తలఁచునెడల

మఱి యపానంబె తనయంత మసలు నెడల
శిశ్నమది తనంతనె విసర్జించునెడల
ఇంక నా ప్రయోజనమేమి యెవరు నన్నుఁ
దెలిసికొనఁ జూతురనిలోనఁ దలఁచెనాత్మ॥

ఆతని తలఁచి పాపిడిని జీల్చియందుఁజొచ్చె
ఇదియె విధృతియనెడు ద్వారమిందు గుండ
నరిగి యాపరబ్రహ్మ యానందమొందు
నంచుచే నిది నాందనమనగఁ బడియె॥

అతనికట మూఁడు వాసగేహములు గలవు
స్వప్నజాగత్సుషుప్తులన్ స్వప్నములను
మూఁటినటఁగాంచు; మదిస్వప్నమునకుఁ,
గన్ను జాగ్రతకు, హృదినిద్రకున్ స్థానములగు॥

అన్యజన్మంబులెత్తెడు నప్పుతఁడు
తండ్రిమేన శుక్రంబునఁదల్లి మేన
నుదరగర్భాశయంబునఁ బిదపఁదనదు
నొడలినిల్పి యిట్టులమూఁడు విడిదురొందు॥

(పై పద్యము మూడు స్థానముల వివరణ)

అతఁడు మెయిఁజొచ్చి భూతంబులన్నిటిఁ దెలిసికొనుచు
"ఇందు బ్రహ్మముకంటె వేఱెదియున్నదందు" ననుచుఁ
దలఁచి "వ్యాప్తతముఁడు బృహత్తముఁడు నయిన
యీ పురుషునెగని నాస్వరూపుగంటి" ననితలఁచె॥

తత్మా దిదం(ద్రోనా మేదం(ద్రోహవైనామ, తమిదం(ద్రం సంతం
ఇం(ద ఇత్యాచక్షతే పరోక్షేణ పరోక్ష(ప్రియా ఇవహిదేవాః
పరోక్షపి(్రియా ఇవహదేవాః॥

దీనిని సాక్షాత్కరించుకొనెను గాన ఇదం(ద్రుఁడనఁబడెను (ఇదం(ద్రష్య తీతి ఇదం(ద్రః) ఇదం(ద్రుఁడనఁబడెను. ఇదం(ద్రుని ఇం(ద్రుఁడని సమముగా పేరుతోనేచెప్పక పరోక్షముగాఁ జెప్పెదరు. దేవతలు పరోక్షముగాఁ బిల్వఁ బడుటయె (ప్రియముగాఁ గలవారువలె నుందురుగదా. పరోక్షముగాఁ బిల్వఁ బడుటయె (ప్రియముగాఁగలవారువలె నుందురుగదా.

ఇతి

తృతీయః ఖండః
(ప్రథమోఽధ్యాయః

## అథ

## ద్వితీయోఽధ్యాయః

ఓం పురుషే హ వా అయమాదితో గర్భోభవతి య దేత(ద్రేతః
తదేత త్సర్వేభ్యోఽంగేభ్య స్తేజః సంభూతమాత్మన్యేవాఽఽత్మానంబిభ ర్తి॥

ఈ గర్భము మొదటఁ బురుషునియందు రేతస్సు రూపముగానుండును. ఈ రేతస్సు అన్నియంగములనుండి పుట్టినదై తనయందు తన్నే భరించి యుండును.

తద్యదాస్త్రియాం సించత్యథై నజ్జనయతి తదస్య(ప్రథమంజన్మ
తత్స్త్రియా ఆత్మభూయం గచ్ఛతి యథాస్వమంగంతథాస్మాదేనాం నహినస్తి॥

ఆవీర్యము స్త్రీయందెప్పుడు పురుషుఁడుంచునో అపుడు ఈ గర్భమును పుట్టించు నిది మొదటిజన్మ. ఆగర్భముస్త్రీతో తనసొంతయంగమువలె ఐక మొందును, అట్లు అగుటవల్ల ఈ స్త్రీని ఆగర్భముబాధింపదు.

కావున నిది దర్శించుటన్ దేవుఁడిదంద్రుఁడయ్యె
ఈశుఁడె యిదంద్రుఁడనఁబడు నీయిదంద్రుని బరోక్ష
దృష్టినిదలోపమొనరించి యింద్రుఁడనుచు వచింత్రు
దేవులు పరోక్షనామమందె ప్రియులై యుంద్రు గాదె
దేవులు పరోక్షనామమందె ప్రియులై యుంద్రుగాదె॥

ఇది

మూఁడవ ఖండము

మొదటి యధ్యాయము

ఇంక

రెండవ యధ్యాయము

మొట్టమొదట నీగర్భంబు పురుషునందు
వీర్య రూపంబుతోడుత వెలయుచుండు
అంగములనెల్లఁబుట్టు తేజోంశమిదియ
దీని నీయాత్మ తనలోనఁ దానె తాల్చు॥

ఈ యాత్మ స్వకర్మచేఁ జంద్రలోకముచేరి కర్మక్షీణింప వర్షాదుల ద్వారా ఈ లోకముతిరిగి చేరియోషధులై పురుషాగ్నిఁజొచ్చి క్రమముగా వీర్య మగునని భావము.

ఉవిదయను నగ్ని వీర్యమాహుతి యొనర్చ
పొడము గర్భ, మియ్యదెపీని మొదటిజన్మ
అంత నాతేజ మి యుంతి నైక్యమొంది
సొంత యంగ మట్లావంత వంత యిడదు॥

సాఽస్యైత మాత్మానమత్ర గతంభావయతి సాభావయిత్రీ
భావయితవ్యా భవతి తంస్త్రీ గర్భం బిభర్తి॥

ఆమె యీ భర్తయొక్క యీ యాత్మను తనయందు గర్భరూపముగా నున్న దాని వృద్ధిపొందించును. వృద్ధిపొందించుచు వృద్ధిపొందించఁ దగినదగును అట్టి గర్భమును స్త్రీ భరించును.

సో అగ్ర ఏవకుమారం జన్మనోఽగ్రేఽధిభావయతి సయత్కుమారం
జన్మనోఽగ్రేఽధిభావయత్యాత్మానమేవతద్భావయతి॥

ఆ తండ్రి తనలో ముందేపుట్టిన కుమారుని జన్మకు పిదప వర్ధిల్లఁ జేయును, అతఁడు జన్మకుఁ బిదప కుమారుని వర్ధిల్లఁజేయుట యనఁగా తన్ను వర్ధిల్లఁజేయుటయే.

ఏషాం లోకానాం సంతత్యా ఏవం సంతతా హి
ఇమే లోకాస్తదస్య ద్వితీయం జన్మ॥

ఈ లోకములయొక్క సంతతిస్థితి కొఱకెట్లు ఈ లోకములు ఎడతెగక యున్నవి. కాన ఈ యాత్మకు ఇది రెండవజన్మము.

సోఽస్యాఽయమాత్మా పుణ్యేభ్యః ప్రతిధీయతే
అథాఅస్యాయమితర ఆత్మాకృత కృత్యోపయోగతః ప్రైతి
స ఇతః ప్రయన్నేవ పునర్జాయతే తదస్య తృతీయం జన్మ॥

ఈ తండ్రియొక్క పుత్రరూపమైన యాత్మ పుణ్యకర్మలకై తండ్రికె బదులుగా ప్రతినిధి యగుచున్నది. మఱి ఈ పుత్రునికంటె ఇతరముగానున్న తండ్రియాత్మ కృతకృత్యమై చనిపోవుచున్నది. ఆ తండ్రియె యాత్మ ఇక్కడ నుండి దేహమును విడచుచునే తిరిగి (తృణజలూకవలె దేహాంతరముపొందు= గడ్డిపురుగువలెనున్నది) పుట్టుచున్నది అది యితని మూడవజన్మ॥

తదుక్తమృషిణా=అది మంత్రముచేఁ జెప్పఁబడినది
గర్భేను సన్ను ఏషామవేదమహం దేవానాంజనిమాని విశ్వా
శతం మాపుర ఆయసీ రరక్షన్నధః శ్యేనోజవసా
నిరదీయమితిగర్భ ఏవ ఏతచ్ఛయానో వామదేవ ఏవము వాచ॥

వనిత తనభర్త తనలోన నునిచినట్టి
తేజమది యుక్తరీతి వర్ధిల్లఁజేయు
ఇటుల వర్ధిలఁజేసి, వర్ధిల్లఁజేయఁ
దగినదై యామెగర్భమొగినిదాల్చు॥

ముందె వీర్యరూపంబుగఁ బుట్టుసుతుని
జన్మపిదప వర్ధిలఁజేయు జనకుఁడంత
చెలిమిఁ దనయుని వర్ధిలఁజేయుటనఁగఁ
దానెతను వర్ధిలఁజేయుఁబూనుటెయగు॥

ఈ విధి నీలోకంబులు
నే విధివిచ్ఛేదమొందనేరవు జగతిన్
ఈ విధి లోకములెడతెగ
కావిర్భవిలు, రెండవ భవమాత్మకునిదియే॥

తనయు రూపముగనిన యీ తండ్రియాత్మ
క్షితిని పుణ్యకర్మలుసేయఁ బ్రతినిధి యగు
జనకునాత్మయొ వయసేగఁ బనియుఁదీఱ
చని మరలఁ బుట్టు మూఁడ జన్మమదియ॥

గడ్డిపురుగు ఎట్టు ఇంకొక గడ్డిపోచను బట్టుకొని వెనుకనున్న గడ్డిపోచను వదలునో యట్లెయాత్మ ఇంకొకదేహమునఁ బ్రవేశించుచు ఈ దేహమును వదలును ఇది మూఁడవజన్మమని భావము.

ఏనుగర్భంబున వసించి యీ యధిదేవతాళి
జన్మలెల్లఁ దెలిసితి, నన్నినుమ్మఁబోలిన యనేక
దేహములుప్రోచినవి, డేగతీరున వానిఁజీల్చి
బయటఁబడితని గర్భస్థ వామదేవుండు తెలిసె॥

తల్లిగర్భమున ఉండుచునే ఈ వాక్కు అగ్ని మొదలగు ఇంద్రియాధి దేవతల సర్వజన్మలను తెలిసికొంటిని నాముందున్న అనేకమైన యినుమువలె భేదింపరాని దేహములు నన్నురక్షించినవి. క్రిందకు డేగవలె వానిని వేగముగాఁ జీల్చుకొని బయటఁబడితిని అనిగర్భమందుఁ బరుండినవాఁడై వామదేవుఁడు పలికెను.

స ఏవం విద్వానస్మాచ్ఛరీర భేదాదూర్ధ్వ ఉత్క్రమ్యాముష్మిన్
స్వర్గేలోకే సర్వాన్కామానాప్త్వాఽమృతః సమభవత్ సమభవత్॥

ఆ వామదేవుఁడిట్లు తెలిసినవాఁడై యీ శరీరము భిన్నమయిన తరువాత ఉదరగతుఁడయి పరమాత్మయయి యీ సంసారమువిడిచి యీ స్వర్గలోకమున అనఁగా తన యాత్మరూపమయిన లోకమున సర్వకామములనుబొంది యమృతుఁ డయ్యెను అమృతుఁడయ్యెను.

ఇతి

ద్వితీయో ఽధ్యాయః

## అథ

## తృతీయో ఽధ్యాయః

ఓం కోఽయమాత్మేతి వయముపాస్మహే, కతరః స ఆత్మా
యేన వాపశ్యతి, యేన వాశృణోతి, యేనవా గంధానాజిఘ్రతి
యేనవావాచం వ్యాకరోతి, యేనవాస్వాదు చాస్వాదు
చ విజానాతి, యదేతద్ధృదయం మనశ్చైతత్
సంజ్ఞాన మాజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధా
దృష్టిర్ధృతి ర్మతిర్మనీషా జూతిః స్మృతిః
సంకల్పః క్రతు రసుః కామో వశః ఇతి॥

ఈ యాత్మయనునదేది, దేనిని మనముపాసించుచున్నాము అదియేది ఇక్కడ ఉపాసింపఁదగినది నిరుపాధిక సోపాధికములలో నేది దేనిచేఁ జూచునో దేనిచే వినునో దేనిచే గంధములను సువాసనచూచునో దేనిచే వాక్కును వివ

సర్వలోకము జన్మమరణాది బంధములంబడి సంసారసముద్రములోపడి ఎట్లో శ్రుత్యాదులచేఁ దన్ను తెలిసికొనినప్పుడు సంసారబంధములనుండి ముక్తుఁడగునని యీ శ్రుతి తెలుపుచున్నది.

ఇటు దెలిసి యీ తనువును నశింపఁజేసి
యూర్ధ్వపదమొంది సంసృతినుండి వెడలి
ఆత్మరూపమునందె పూర్ణాప్తకాముఁ
డయి యమృతుఁడౌ నమృతుఁడగు నార్షమిద్ది॥

స్వర్గలోకమనఁగా తన స్వరూపమెయని శంకరభాష్యము, సమగ్జ్ఞానార్జితమగు లోకము అనగా స్వరూపము అని విద్యారణ్యులు.

ఇది
రెండవ యధ్యాయము

ఇంక
మూఁడవ యధ్యాయము

ఈ యాత్మ నవేది, యెద్దాని మన ముపా
సింతు, మాయాత్మ యుందేదియగునో
దేనిచేఁ జూతుమో దానినాత్మ యటంద్రె
యాలకించెడు నదె యాత్మ యగున
దేనిచే వాసనతిలకింతుమో యది
యాత్మయే? పల్కున దాత్మయగునె
స్వాదు వస్వాదు వాస్వాదించునది యాత్మ
యే, యాత్మయే చిత్తహృదయములును
జ్ఞాన విజ్ఞాతా జ్ఞాన ప్రజ్ఞానములును
మేధ, దృష్టి ధృతి మతియుస్మృతి మనీష

రించునో దేనిచే రుచియైనది రుచికానిదియుఁ దెలిసికొనునో ఏదైతే హృదయము మనస్సు అనునవిగనుండునో ఈ వస్త్వాదిజ్ఞానమును, అజ్ఞము, కళాకౌశలము, ప్రజ్ఞయు, మేధ, విషయజ్ఞానము ధైర్యము, మననము, బుద్ధి, మనోవ్యాధి, స్మృతి, సంకల్పము, నిశ్చయము ప్రాణశక్తి, ఆశ, కామేశ్చ ఇవియన్నియు ఆత్మయగునా?

సర్వాణ్యే వైతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవంతి
ఏష బ్రహ్మ ఏష ఇంద్ర ఏషప్రజాపతి రేతేసర్వేదేవాః॥

ఇవియన్నియు చైతన్యముయొక్క నామాంతరములె ఁగు ఇదేబ్రహ్మము ఇదే ఇంద్రుఁడు ఇదే ప్రజాపతి ఆగ్న్యాదిదేవతలును ఇదే.

ఇమానిచపంచ మహాభూతాని పృథివీ
వాయురాకాశ ఆపోజ్యోతీంష్యేతానీమానిక్షుద్రమశ్రాణీవ
బీజానీతరాణిచేతరాణి॥

భూమి గాలి ఆకాశము నీరు వెలుగు అను మహాభూతములైదును విడివిడిగానున్న చిన్నవి పెద్దవి కలిసినవియును ఇదే, ఇంకను ఇతరేతరములగు బీజములునునదే.

అండజానిచ జారుజానిచ స్వేదజానిచోద్భిజ్జానిచ॥

గుడ్డునుండిపుట్టు పక్షి సర్పాదులును మావినుండుపుట్టు పశువులు మనుష్యులు చెమటనుండిపుట్టు పేలు. మొ. నేలనుపెల్లగించువచ్చు చెట్టు మొదలగునవి యన్నియునదే.

అశ్వాగావః పురుషా హ స్తినోయత్కించేదం ప్రాణి జంగమంచ
పతత్రిచయచ్చ స్థావరం సర్వంతత్ ప్రజ్ఞానేత్రం ప్రజ్ఞానే ప్రతిష్ఠితం
ప్రజ్ఞానేత్రోలోకః ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ॥

గుఱ్ఱములు గోవులు పురుషులు ఏనుగులు ఈ సర్వప్రాణులు జంగమములుగాని పక్షులుగాని స్థావరములుగాని సర్వము అది ప్రజ్ఞయైన బ్రహ్మచే నడపఁబడునది, ప్రజ్ఞానమందె యున్నది. లోకము ప్రజ్ఞయైన బ్రహ్మమే నేత్రముగాఁగలది. ప్రజ్ఞయె ఆ ఆధారము ప్రజ్ఞానమె బ్రహ్మము.

యాధి సంకల్పము, స్థిరత, ప్రాణశక్తి
ఆశ, కామేచ్ఛ యివియైన నాత్మయగునె॥

విజ్ఞత=కళాకౌశలము, ఆజ్ఞానము=ఆజ్ఞ మతి=మనము, మనీష=మనస్స్వా తంత్ర్యము ఆశ=దూరవిషయములందు కోరిక, కామేచ్ఛ=స్త్రీవాంఛ.

అరయుటాదిగఁ గామేచ్ఛవఱకు జ్ఞాన
ములివియన్నియుఁ జైతన్యమునకె పేర్లు
ఇదె ప్రజాపతి, యిదె బ్రహ్మయింద్రుఁడిదియె
ఎల్లదేవతలును గూడ నిదియెసుమ్మి॥

అవని నీరు గాలియు నగ్నియాకసంబు
లనెడి పంచభూతంబులు నదియెసుమ్మి
పురువులాదిగ నల్పజీవులును నదియె
నిఖిలమయిన బీజములకున్ బీజమదియ॥

అండజంబులౌ పక్షిసర్పాదులదియ
జంతుమనుజాదిక జరాయుజములు నదియ
కృములు దోమలాదిగ స్వేదజములు నదియ
తరువులాదిగ నుద్భిజ్జములును నదియ

అండములు=గుడ్డునుండి పుట్టినవి. జరాయుజములు=మావినుండి పుట్టి నవి, స్వేదజములు=చెమటనుండి పుట్టినవి, ఉద్భిజ్జములు=నేల పెల్లగించుకొని పుట్టినవి.

గుఱ్ఱములు నావులు నరులేన్గులు పక్షు, లవనిఁగలుగు
జంగమ స్థావరాత్మక సకలజీవంబులదియ

స ఏతేన ప్రజ్ఞేనాఽఽత్మనాఽస్మాల్లోకా దుత్క్రమ్య
అముష్మిన్ స్వర్గేలోకే సర్వాన్‌కామానాప్త్వాఅమృతః సమభవత్ సమవత్॥

వామవేదుఁడు ఇది తెలిసినవాఁడయి ప్రజ్ఞారూపమైన యాత్మతో ఈ లోకమునుండిపోయి ఈ స్వర్గలోకమున సర్వకామములనుపొంది అమృతుడై యయ్యెను.

శాంతి మంత్రః (చూ. మొదట)

ఇతి

తృతీయో ఽధ్యాయః

ఐతరేయోపనిషత్‌సమాప్తా



అదియె ప్రజ్ఞచే నడపించునది ప్రజ్ఞయందె నిల్చు
ప్రజకుఁ గన్ను ప్రజ్ఞ, ప్రతిష్ఠ ప్రజ్ఞ బ్రహ్మము ను ప్రజ్ఞ॥

ఇటుల వామదేవుఁడు నీ బ్రహ్మ మెఱుఁగువాఁడు
ఇట్టి ప్రజ్ఞాత్మతోడ సంసృతిని వెడలి
జ్ఞానలబ్ధలోకములఁ బూర్ణాత్మకాము
డగుచు ముక్తుఁడమృతుఁడయ్యె నమృతుఁడయ్యె॥

శాంతిమంత్రము (చూ. మొదట)

ఇది

మూఁడవయధ్యాయము

ఇది శ్రీ వెంకమాంబనారాయణశాస్త్రుల తనయుండగు

చర్లగణపతిశాస్త్రిచే ననువదింపఁబడిన

ఐతరేయోపనిషత్తు సమాప్తము

